Sundaram's Series No. 1

# గ్రామాధికారుల పరీక్షానోట్సు
# గ్రామపారిశుద్ధ్యము

## Exhaustive
# Village Officers Special Notes
### Village Sanitation

*For the use of Village Headman Examination Candidates*

*By*
BODDAPATI PURNA SUNDARARAO PANT
Propriator & Principal

Sundaram's Village Officers College
Gudivada, and its Branches





First Edition 1000 Copies
1948

Price 1-12-0
Postage Extra

## కృతి

నన్ను కనిపెంచి స్వర్గస్థులైన మదీయ మాతాపితృలకు

యీ చిన్ని పొత్తమును అంకితము

చేయుచున్నాను.

గ్రంథకర్త

# పీఠిక

ఆంధ్రజిల్లాలలోని విలేజిఆఫీసర్ల ట్యుటోరియల్ ఇన్ స్టిట్యూట్ ప్రొప్రయిటరును ప్రిన్సిపాల్ గారును అగు శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారిచే వ్రాయబడిన గ్రామాధికార్ల పరీక్షానోట్సు సీరీసులో గ్రామపారిశుద్ధ్యమునకు సంబంధించిన 1 వ నంబరు పుస్తకమును నేను చదివిచూచినాను. ఈగ్రంథకర్త గ్రామోద్యోగుల పరీక్షలకు విద్యార్థులను తరిఫీదు చేయుటలో చాలాకాలమునుంచి కృషిచేయుచు ఈవిషయమున ప్రత్యేకఅనుభవమును సంపాదించియున్నారు. వీరి పాఠశాలల సహాయముతో అనేకమంది గ్రామోద్యోగులు పరీక్షలలో ఉత్తీర్ణులైయున్నారు. ఇది ప్రశంసాపాత్రము. ఈ పుస్తకములో ఈభాగమునకు సంబంధించిన పరీక్షకుకావలసిన అన్నిసంగతులు విపులముగా అందరికి తెలియులాగున వివరించబడియున్నది. అవసరమైన అంశములేమియు వదలలేదు. గవర్నమెంటు మాన్యూయల్‌లో లేనటువంటివి గ్రామోద్యోగస్థులు ముఖ్యముగా తెలుసుకోవలశినవిఅయిన అనేక క్రొత్తసంగతులుకూడా ఈపుస్తకంలో వివరింపబడినవి. గ్రామోద్యోగపరీక్షలకు చదువు విద్యార్థులకు గ్రామపారిశుద్ధ్యము విషయములో ఈపుస్తకం ఎక్కువ ఉపయోగకారిగానుండగలదని నేనుగట్టిగానమ్ముచున్నాను. ఈగ్రంథకర్తగార గ్రామోద్యోగపరీక్షలో మిగిలినభాగములకు సంబంధించినవిషయములనుగూర్చి పరీక్షకు యుపయుక్తమగునటుల నోట్సును శీఘ్రకాలములోనే ప్రచురించబడగలదని నమ్ముచున్నాను.

బెజవాడ
13-1-1948

(Sd) ల॥ లక్కరాజుపంతులు
రిటైర్డుడిస్ట్రిక్టుకలెక్టరు

# అభిప్రాయములు

1. రిటైర్డు డిప్యూటీకలెక్టరు శ్రీ చాగంటు సాంబయ్య ఎం. ఏ. గారిట్లు వ్రాయుచున్నారు.

గ్రామోద్యోగస్థుల ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారిచే రచింపబడిన గ్రామపారిశుద్ధ్యముఅను గ్రంధం పరీక్షావిద్యార్థులు మ్యాన్యూయిల్‌తో సంబంధంలేకుండానే చదివిప్యాసుఅగుటకు సందేహము లేదని వ్రాసిరి.

ది 30-11-46 తేదీన కళాశాల 23 వార్షికోత్సవ సందర్భములో అధ్యక్షుడు గుడివాడ డిప్యూటీకలెక్టరు శ్రీ కె. సూర్యారావునాయుడుగారు చెప్పినది. గ్రామోద్యోగీయ కళాశాల అనునది యెక్కడ చూడలేదనియు, బొడ్డపాటి పూర్ణసుందరరావుగారు 23 సం॥ ల క్రిందట స్థాపించి 3782 మంది విద్యార్థులను తరిఫియతుచేయుట మిక్కిలి ప్రశంసాపాత్రమైనదియు. వీరికృషికి భగవంతుడు ఆయురారోగ్యము నిచ్చుగాక యని ఆశీర్వదించిరి. భారతవిద్యార్థి కాంగ్రెసు సహాయ కార్యదర్శి ఎన్. వి. యస్. ప్రసాదరావు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరుగార్లుకూడా ప్రశంసించిరి.

3 ది 25-9-46 కృష్ణామండల గ్రామోద్యోగుల మహాసభ బందరునందు అఖిలభారత కాంగ్రెసు సభ్యులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యచౌదరిగారి అధ్యక్షతను జరిగినసభలో గావించబడిన 11 వ తీర్మానము.

"22 ఏండ్లుగా గ్రామోద్యోగుల శిక్షణతరగతుల నెలకొల్పి ఈసంఘమునకు అపారసేవ చేస్తున్న శ్రీ బొడ్డ

పాటి పూర్ణసుందరరావుగారిని హృదయపూర్వకముగా అభి నందించుచున్నారు"

పోతార్లంక గ్రామమునసబుగారు ఆహ్వానసంఘాధ్యక్షుడు కొల్లి వెంకటాద్రిచౌదరిగారిట్లు వ్రాసిరి. 22 ఏండ్లుగా మన జిల్లాలో గుడివాడయందు కరణం మునసబుల ట్రయినింగుస్కూలు స్థాపించి సంఘసేవచేయుచున్న శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారు మనకు మార్గదర్శకులైరి. వీరిసేవ మిక్కిలి ప్రశంసనీయము.

4 ది 5-5-47 గుడివాడ తాలూకా గ్రామోద్యోగుల మహాసభలు గావించిన 17 వ తీర్మానం.

"23 ఏండ్లుగా గ్రామోద్యోగుల శిక్షణతరగతుల నెలకొల్పి గ్రామోద్యోగుల పురోవృద్ధికి అపారసేవచేస్తున్న శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారిని హృదయపూర్వకముగా యీసంఘమువారు అభినందించుచున్నారు."

పామర్రు కర్ణంగారు సంఘ సెక్రటరీ శ్రీ తుర్లపాటి వెంకటాచలశర్మగారిట్లు వ్రాసిరి.

మీరు గ్రామోద్యోగుల శిక్షణతరగతులు నెలకొల్పి గ్రామోద్యోగుల పురోవృద్ధికి పాటుపడుచున్నందులకు మీకు అనేకవందనము లర్పించుచూ మీకు భగవంతుడు సకల సంపూర్ణ ఆయురారోగ్యము యివ్వగలందులకు ప్రార్థించుచున్నాను.

(5) ది 6-7-46 ఆంధ్రదేశ గ్రామాధికార్ల సంస్కృతి సంఘ మహాసభ గుంటూరులో శ్రీ దేశభక్త కొండా వెంక

టప్పయ్యావంతులుగారి అధ్యక్షతను శెక్రటరీ, ఏటుకూరు కర్ణంగారు ఎ. శీతారామయ్యగారు గ్రామోద్యోగుల విష యమై కళాశాలను స్థాపించి బొడ్డపాటి పూర్ణసుందరరావు గారు చేయుచున్న కృషిని గొనియాడిరి.

(6) ది 9-9-46 గ్రామోద్యోగీయ కళాశాల ప్రాత విద్యార్థిసంఘ 5 వ మహాసభ బెజవాడలో కొంగర వెంక ట్రామయ్యచౌదరి అధ్యక్షతను జరిగి గావించిన తీర్మానం

1925 లో కళాశాలస్థాపించి గ్రామపునర్నిర్మాణ పద్ధతులపైన గ్రామోద్యోగీయులకు రైతులకు గ్రామీణులకు శిక్షణతరగతుల నెలకొల్పి 3782 మంది విద్యార్థుల నుత్తీర్ణుల జేసిన మనగురువుగారైన శ్రీ బొడ్డపాటి పూర్ణసుంద రావుగారికి అనేకవందనము లర్పించుచు విద్యార్థులకు చెప్పు చున్న నోట్సులన్నియు అచ్చొత్తించి ఆంధ్రమండలములోని అన్నిప్రాంతములకు అందజేయవలసినదిగా ప్రిన్సిపాల్ గారిని యీసభవారు కోరుచున్నారు.

# ఉపోద్ఘాతము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణో గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరంబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః

యీ పుస్తకం వ్రాయుతలంపు నాకెన్నడులేదు వ్రాయగల యోగ్యతలేదు. ఆరోగ్యశాస్త్రమును గురించి వ్రాయుట మతికష్టము అయినను గుడివాడతాలూకా బిళ్లపాడు అగ్రహారంకు మిరాశీహక్కుచే కలిగిన గ్రామాధికారి యుద్యోగానుభవమువల్లను, ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగీయుల సంఘకార్యదర్శిగానుండి చెన్నరాజధాని గ్రామోద్యోగులతోను, ప్రభుత్వ ఉన్నతాధికారులతోను, గ్రామీణులతోను కలిగిన పరిచయమువల్లను, విద్యనభ్యశించుటకు తగిన గురువు లభింపక భగవత్ప్రేరేపణతో చేశినస్వయంకృషివల్లను, స్వానుభవముకల్గి మిత్రులప్రోత్సాహముచే వ్రాయ సంకల్పించితిని.

గ్రామోద్యోగుల విద్య, గౌరవవేతన, హక్కుబాధ్యతలను పెంపొందింపజేయుటకును, గ్రామోద్యోగుల గ్రామీణులమధ్యపరస్పరసహకారసంబంధమైత్రిని వృద్ధిచేయుటకును, గాంధిమహాత్ముని ఆదేశానుసారం గ్రామపునర్నిర్మాణ పద్ధతులు అమలుపరచుటకును, తెలుగునాడుయందు ప్రప్రథమమున 1925 సం॥ న గుడివాడయందు విలేజిఆఫీసర్సు ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్ అను సుందరమ్ గ్రామోద్యోగీయకళాశాల పేరుతో నొక అపూర్వసంస్థను స్థాపించితిని. యీకళాశాలయందు 1 గ్రామోద్యోగులు 2. మైనరుహక్కుదార్లు 3 వీరివంశీకులు 4 రైతులు 5 పంచాయితీ ప్రెశి

డేలు 6 గ్రామపాలనయందభిరుచిగల సమస్త ప్రజలకు, జాతి, మత, కుల, వివక్షత లేకుండా, 1 విద్య 2 ఆరోగ్యం 3 నీటి పారుదల 4 వ్యవసాయం 5 పురరక్షణం 6 చికిత్సాసంబంధం 7 పరపతి 8 పంచాయితీలు 9 దస్తావేజులు 10 సర్వే 11 మునసఫీ 12 గవర్నమెంటుకర్ణం 13 జమీందారుకర్ణం 14 కుటీర పరిశ్రమలు, అను తరగతులయందు గవర్నమెంటుఆర్డర్లు బోర్డుస్టాండింగుఆర్డర్లు, కలెక్టర్ల స్టాండింగుఆర్డర్లు గ్రామమాన్యూయల్సు, ఆక్టు అంక్ రిగ్యులేషన్ మొదలుగాగలవి ఎప్పటికప్పుడు సవరణలతో తెప్పించి, స్వయంగా తయారుచేసిన నోట్సులు చెప్పి, విపులంగా బోధించి, నేటికి 3841 మంది విద్యార్థుల నుత్తీర్ణులను చేసితిని. ఇట్టిశిక్షణ ఆంధ్రదేశ ప్రజల అందరికీ లభించుట దుర్లభమనియు, అచ్చొత్తించుట ప్రజాభ్యుదయమునకు శ్రేయోదాయకమనిన్ని, ప్రజానీక మిచ్చిన సలహాపై అచ్చొత్తించుటకు అంగీకరించితిని.

గవర్నమెంటు మాన్యూయల్ సందు లేని అనేక విషయములు పరీక్షావిద్యార్థుల కుపయోగపడులాగున యిందు పొందుపరచితిని.

యీపుస్తకం పరీక్షావిద్యార్థులకేగాక, ఆరోగ్య నియమములు పాటించు యల్లరకున్ను యుపయోగపడును. పాఠశాలయందు పఠనగ్రంథంగాకూడ నుండతగినది. వ్యాధివచ్చిన తర్వాత చికిత్స చేయుటకంటె రాకుండచేయుటయే మేలు, అనుటయే దీని ప్రాముఖ్యత. వైద్యుడు వచ్చులోపల ప్రాణాపాయమునుండి తప్పించుటకు అవలంబింప తగిన ముందు జాగ్రత్తల నన్నిటిని యిందు సమకూర్చితిని.

యీ కళాశాల యుపయోగమునుగూర్చి విద్యార్థులే గాక గ్రామోద్యోగులు తమ జిల్లా, తాలూకా సంఘసభల యందు అభినందన తీర్మానములచే గొనియాడిరి. ప్రభుత్వోద్యోగీయులు ప్రశంసాపాత్రముల నొసంగిరి. గ్రామీణులు తమకు యెక్కువ విజ్ఞానము గలుగచేయుచున్నదని పొగడిరి.

యీ కళాశాల ఎందరి, స్వార్థదుష్టవ్యతిరేక వినాశన కర శక్తులకైనను ఢీకొని నేటివరకు అవిచ్ఛిన్నముగా, అజేయముగా శుక్లపక్షచంద్రునివలె అభివృద్ధి పొందుతూవున్నది. భవిష్యత్తుకూడ నా విద్యార్థులు, గ్రామోద్యోగులు, గ్రామీణులుయొక్క సహకారముచే యీ కళాశాల మేనేజరయిన నాపుత్రుడు చిరంజీవి లక్ష్మీనృసుబ్బారావు యీ కళాశాలను ఎక్కువ ఉన్నతస్థితికి తీసుకురాగలడని విశ్వసించుతూ అట్టి శక్తిని అతనికి యిచ్చుగాత అని భగవంతుని ప్రార్థించుచున్నాను.

పుస్తకం వ్రాయుటలో నాకిది ప్రథమప్రయత్నమగుట వల్ల లోపము లుండవచ్చును. గుణగ్రహణపారీణులగువారు దయార్ద్రహృదయముతో తెలిపిన వందనశతంబులర్పించుతూ సవరించుకొనెదను.

యీపుస్తకమునకు పీఠిక వ్రాసియిచ్చి అనేకసలహాలు యిచ్చి నా ఉద్యమమునకు అమితోత్సాహం కలుగజేసిన రావుబహద్దూర్ శ్రీ శ్రీ శ్రీ లక్కరాజు లక్కరాజువంతులు బి. యే. రిటైర్డుడిస్ట్రిక్టు కలెక్టరుగారికిన్ని అభిప్రాయములు

వ్రాసియిచ్చిన ప్రముఖులకున్నూ అనేకవందనము లర్పించు చున్నాను.

ఎన్నిపనులున్నను సకాలములో అచ్చొత్తించి యిచ్చిన శ్రీ లాల్ ప్రింటింగ్ ప్రెస్ వారికి కృతజ్ఞుడను.

జై హింద్

ఇట్లు
బుధజనవిధేయుడు
గుడివాడ 1-2-1948 — బొడ్డపాటి పూర్ణసుందరరావు
గ్రంధకర్త



# విషయసూచిక

## 1 వ అధ్యాయం సామాన్యవిషయములు



## 2 వ అధ్యాయం అంటువ్యాధులు

## 3 వ అధ్యాయం విషపుకాటులు



## 4 వ అధ్యాయం అపాయములు



## 5 వ అధ్యాయం అనుబంధములు

# గ్రామాధికార్ల పరీక్షానోట్సు

# గ్రామ పారిశుద్ధ్యము

## 1 వ అధ్యాయం - సామాన్యవిషయములు

## ఆరోగ్యము

(a) ఆరోగ్యమే మహాభాగ్యం. అట్టి భాగ్యము పొందుటకే ప్రతిమనిషి ప్రయత్నించవలెను. యిందుకు 1939 వ సం॥ పు 3 వ నెంబరు మదరాసు పబ్లిక్ హెల్తు ఆక్టు మిక్కిలి ప్రాముఖ్యమైన చట్టము. ఆరోగ్యపదమునకు అర్థము "అనారోగ్యమునుండిగాని లేక వ్యాధినుండిగాని విముక్తులగుటయె" యని చాలమందిభావము. ఇది ఆపదమునకు సంకుచితార్థము. ఆసుపత్రికిగాని వైద్యశాలకుగాని పోనంతమాత్రమున ఆరోగ్యమున్నదని చెప్పదగునా ? ఖండితముగా కాదు. ఆరోగ్యముయొక్క విశాలమైన నిజమైన అర్థము సరియైన స్థితిని తెలుపుచున్నది, వ్యతిరేకస్థితికాదు. అది దేహము, మనస్సుయొక్క స్వాభావికమైన పనులను, శ్లాఘాపాత్రముగ నున్నస్థితిని తెలుపును. ఆరోగ్యముగా నుండుటకును కేవలం జబ్బులేకుండుటకుగాను పరిపూర్ణమైన సుఖస్థితి నొందుటకు ఆలోచించవలెను. సాముదాయక సౌభాగ్యమును పెంపొందించు దేహము, మనస్సునుకలిగి జీవితానందం ననుభవించుటచే తనకును, యితరులకునుగూడ ఉపయుక్తములగు జీవితలక్ష్యమునుకలిగియుండును. కావున ఆరోగ్యము "దీర్ఘ

కాలము జీవించుటకును, శక్తికొలది సేవించుటకును" శక్తిని కలుగజేయును. ఆరోగ్యమే లేనిచో ఎన్ని వున్నను వాని జన్మమునిష్ఫల మనవచ్చును. అనారోగ్యముచే వ్యాధి తెచ్చుకుని చికిత్స పొందుటకన్న వ్యాధిరాకుండ చేసుకొనుటయే మేలు. ఇందుకు ప్రథమప్రయత్నము గ్రామ పారిశుద్ధ్యము విషయములో ఎల్లరు పాటుపడుట అత్యావసరం. అనగా గ్రామము పరిశుభ్రముగా నుంచుటకు ముఖ్యస్థానములందు ప్రభుత్వము వారిచే నియమించబడిన ఆరోగ్యశాఖాధికార్ల సలహాను పొందుట యుత్తమము. గ్రామాధికార్లు కూడా ఇందులో చెప్పబడిన విషయములన్నియు గమనించి హెల్తు ఆఫీసర్లకు మద్దతుగా నుండి గ్రామారోగ్యము కాపాడుట తమ యుద్యోగ ధర్మము.

(B) జనన మరణ రిజిష్టరు :-

గ్రామములో ఏ వ్యాధిప్రబలమగుచున్నదో అట్టి వ్యాధి నిర్మూలించుటకు ప్రత్యేక రిజిష్టర్లు యుంచి నియమించిన ఫారములో హెల్తు యిన్‌స్పెక్టరుకున్నూ, తహశీల్దారుకున్నూ స్పెషల్ నవుకరు ద్వారా దినసరి రిపోర్టులు పంపించి మందులు తెప్పించి ఔషధసేవ చేయించుట ప్రతి గ్రామాధికారికి విధియై యున్నది. మరిన్ని గ్రామాధికారిచే గాని 1899 సం॥ నె 3 ది మద్రాసు ఆక్టు 20వ శెక్షన్ అనుసరించి లోకల్ గవర్నమెంటు వారిచే అధికార మియ్యబడిన రిజస్ట్రార్లచేగాని, తయారు చేయబడుచున్న జనన మరణ రిజిష్టర్లు కూడ పుట్టిన 14 రోజులు, చచ్చిన 4 రోజుల
15 7

లోపల కంపల్‌సరి గ్రామాదులలో కుటుంబ మేనేజరు, మంత్రసాని, డాక్టరు, సత్రం గుమాస్తావల్లను ; కంపల్‌సరిలేని గ్రామాదులలో స్వయంగాను నవుకర్ల ద్వారాను తెలుసుకొని వ్రాసి జనన మరణములు చెప్పనివారిపై 18 (1) శెక్షను ప్రకారం డిఫాల్టు స్టేటుమెంటు తహశ్శీల్దారుకు పంపి, క్యాలెండరు సంవత్సరంలో రిజిస్ట్రారులవల్ల వ్రాయబడి అందలి రివిన్యూ అధికార్లకున్నూ, హెల్తు లేక మెడికల్ వుద్యోగస్తులకున్నూ తనిఖీకి హాజరుపర్చవలెను. జననం 19-1 సెక్షనులో మరణం 19-2 సెక్షనులోను వ్రాసి వీటి అబ్‌స్ట్రాకు నెలాఖర్న 19 ఎ. నమోనాలో తాలూకాకు పంపవలెను. దీనితో పశువుల మరణములు 19-3 రిజిష్టరులో వ్రాశి అబ్‌స్ట్రాకు 19 బి. నమోనాలో తాలూకాకు పంపవలెను.

మరణ రిజిష్టరు నెం 19-2 సెక్షనులో మరణకారణములు వ్రాయించు నుద్దేశ్య మేమన ఏ వ్యాధి ఎచ్చట విస్తారముగా నున్నదో తెలుసుకుని దానిని నివారించు మార్గము కనిపెట్టి ప్రజారోగ్యమును కాపాడుట కొరకే ప్రభుత్వమువారి అభిప్రాయమని ప్రజలు గ్రహించి గ్రామారోగ్యమునకై కృషిసల్పవలెను.

19-1 వ సెక్షన్ జననములు రిజిష్టరుచేయుటలో

1 జనాభాయొక్క వృద్ధ క్షయములను ప్రభుత్వమువారు తెలిశికొనుటకును.

2 చిన్నపిల్లలవయస్సు తెలిసికొని ప్రాథమికపాఠశాల్లఘుండు నిర్బంధపు విద్యను నేర్పుటకును.

3 ప్రజలయందు సంక్రమించు ఆ సీతగాదాలను స్థిర పర్చగల వయస్సు నిర్ధారణ చేయుటకును.

4 మైనరుయొక్క హక్కును పొందుటకు సరియైన వయస్సు దృష్టాంతరమును చూచుకొనుటకును.

5 ఉద్యోగార్హత కలుగ జేయుటకును ప్రభుత్వ ఉద్దేశ్యమైయున్నది.

(c) పట్టణములు పల్లెలు :

ఆరోగ్య విధుల నిర్వర్తించుటలో పల్లెలకంటె పట్టణములే ఎక్కువ హానికరముగా యుండును. ఇండ్లు కిక్కిరిసి యుండుటచే పరిశుభ్రమైన గాలి రాకపోవుట (2) మురికి నీరు పోవు మార్గము సరిగా నుండక దోమలు యీగలు మొదలగు క్రిములబాధవల్ల నిద్ర లేకపోవుట. (3) యిండ్ల మధ్య పాయిఖానాల దుర్వాసన 4. సినిమాలవల్ల నిద్రలేక పోవుట. 5. త్రాగెడు నీటియందు లోపము 6. కాఫీ మొదలగు దురభ్యాసములవల్ల కలిగే లోపములే యిందుకు కారణము. పల్లెలయందు జనసమ్మర్దము తక్కువగానుండుటచే తను విశాలమగు ఆవరణములతో కూడిన యిండ్లు కట్టుటచే గాలి వెల్తురు ధారాళముగావచ్చుటచేతను ఆరోగ్యకరముగా నుండును.

గ్రామప్రజల ఆరోగ్యము, గ్రామములో 1 చెట్లమీద నున్న కోతులు 2 వీధులలోనున్న కుక్కలు 3, కొట్టములలోనున్న పశువులు, 4 యిండ్లలోనున్న ఎలుకలు వీటి ఆరోగ్యమునుబట్టి యుండును. వీటికివచ్చు ప్లేగు,

దొమ్మ మొదలగు అంటువ్యాధులు వాటితో కలిసి తిరిగే ప్రజలకు సోకును. అందువల్ల వాటిబాధ తప్పించుకొనుటకు ఎలుకలను చంపివేయవలెను. పశువులకు టీకాలు వేయుంచవలెను. పిచ్చిజంతువులను కాల్చివేయవలెను. ఎప్పుడైతే గ్రామమునకు పరిశుభ్రత ఏర్పడునో అప్పుడే మానవుడు ఆరోగ్యమును పొందగలడు.

ఆరోగ్యముపొందుటకు మానవుడు

1 నిత్యము సబ్బుతోగాని శీకాయతోగాని ఆరోగ్యముపొందుటకు శరీరము శుభ్రముచేసుకోలేనిచో గజ్జి తామర మొదలగు చర్మవ్యాధులు సంభవించును.

2 భోజనముకు పూర్వం అనంతరం పండ్లను శుభ్రపర్చుకోవలెను లేనిచో పండ్లవ్యాధి (indigestion) కలుగును.

3 నిత్యం పరిశుభ్రమైన గాలియందు వ్యాయామం చేయవలెను.

4 కట్టుబట్టలు యల్లప్పుడు శుభ్రముగా నుంచుకొనవలెను.

5 పరుపు మొదలగు పడకవస్తువులు ఎండబెట్టుటవలన నల్లులు మొదలగునవి చేరవు.

6 ఆరోగ్యవిధులు సక్రమముగా నెరవేర్చుకున్న పూర్ణాయుష్మంతుడగునని తెలుసుకోవలెను.

(d) శిశు మృతి

పుట్టినప్పుడు బలముగలవారైయుండినను మంచిగాలి, మంచినీరు, మంచియాహారమును గావలసినంత దొరకనందున

కొందరు చనిపోదురు తక్కినవారు కేవలం బలహీనులై పుట్టుటవలనను, మిక్కిలి రోగిష్ఠులై పుట్టుటవలనను చనిపోవుదురు.

బలహీనులైన శిశువులు పుట్టుటకు తల్లిదండ్రులలో రోగిష్ఠులుగాని తల్లి లేతవయస్సుగలదై యుండినందున్నా లేక తల్లి దేహమున రక్తముతో పాటు విషద్రవ్యములు ప్రసరించుట చేత గర్భమందుండగనే శిశువుల కారోగ్యము చేడియుండుటచే బలహీనులు కావచ్చును.

(e) సు ఖ వ్యా ధు లు

స్త్రీ పురుషులు దుర్మార్గనడతవల్ల సుఖవ్యాధులు సంపాదించుకుని యితరులకు వ్యాపింపజేతురు. గాన యువకులైన వారిని మంచిమార్గమున బెట్టుటకు, దేహపరిశ్రమకు సరియైన వ్యాయామసంఘములు నియమించుట. స్కూలు పుస్తకములు పాఠశాలలలో బోధించుట జరిపినచో వీటి అపాయము తప్పించుకోవచ్చును.

ఆరోగ్యశాస్త్రానుసారముగా నుండదలచినచో ప్రతి జీవికి ప్రాణాధారమైన వస్తువులు మూడుఅవుసరము. 1. పరిశుభ్రమైనగాలి. 2. నిర్మలమైననీరు. 3. యుక్తమైన ఆహారము.

## 2. గా లి

A. పరిశుభ్రమైన గాలివల్ల ప్రయోజనము :

గాలి లేకపోయినచో కొన్ని నిముషములలో ప్రాణి చచ్చిపోవును. మనలనుసోకి కదలునప్పుడుగాని మనము దానిని తెలుసుకొనలేము. పృథ్వీవాయువు అనే సముద్రములో

మనము తిరుగుచున్నాము. ప్రాణము ధరించుటకు గాలి ముఖ్యావశ్యకమై యుండుటచేత దేహముయొక్క సుఖస్థితికి శుద్ధవాయువుకూడ ముఖ్యావసరమేయగును. గాలి ప్రాణమునకు హాని కలుగజేయునంతటి అపరిశుద్ధముకాదు. గాని తన్ను పీల్చువారు తమ దేహసౌఖ్యముచెడి అన్నివిధములైన రోగములవల్లను బాధలుపడునట్లు చేయునంతటి అపరిశుద్ధము కలదియగును.

(b) గాలి చెడుటకు కారణములు:

గాలి శుభ్రమైనను, కల్మషపదార్థములమీదుగా వచ్చినప్పుడు దుర్గంధముగలిగి చెడిపోవుచున్నది. ఎట్లనగా 1. వంట చేయుట, అంట్లుతోముట మొదలగు గృహకృత్యములవల్ల బుట్టెడు అశుచికారణములు జాగ్రత్తగా ఎప్పటికప్పుడే తొలగింపకుండుట. 2. చచ్చినజంతువులను, కసాయివాండ్రు, తోళ్లు బాగుచేయువారు చేయుపనులవల్లను, 3. ఇనుము మొదలగు లోహములతో పనిచేయుచుండునపుడు లోహపుతునకలు నుంచి మొలికలుఎగిరి వాయువుతో చేరుటవల్లను మొదలగు కారణములచే వాయువు చెడినందువల్ల అదిపీల్చువారికి రోగకారణము కలుగుచున్నది.

(c) అపరిశుద్ధవాయువు నివారించుమార్గము:

1. ఇండ్లు ఎత్తయిన ప్రదేశమందు నిర్మించి వెలుతురు, గాలి వచ్చునట్లుగా పెద్దకిటికీలను నిర్మించవలెను. 2. సాధారణముగా పడకగది ఇంటికి దక్షిణపువైపునే యుంచవలెను.

3. పాయఖానా యింటికి దిగువభాగమున దూరముగా యుంచవలెను. 4. సాధ్యమైనంతవరకు ప్రతిమనిషికి 8 అడుగుల పొడువు 6 అడుగుల వెడల్పు చోటు కావలసియుండు నట్లు యుంచవలెను. గనుక ఆదాయమును కుటుంబము యొక్క జనసంఖ్యనుబట్టి యింటివసతి ఏర్పరచుకోవలెను. 5. రోగులను ప్రత్యేకగదులలో నుంచవలెను. 6. బాలింతరాండ్రను గాలిలేనిగదిలో నిర్బంధించిన క్రొత్తగాపుట్టిన శిశువులకు అపాయముగనుక విశాలమైన గదులలో నుంచిన యడల పురిటిదినములలో ఇరుగుపొరుగువారు, చుట్టములు మూగియున్నప్పటికి యిబ్బందిలేకపోవును. 7. పరుండు గదులలో వంటలు చేయకూడదు. 8. పొగవచ్చు మోటుదీపపు శెమ్మెలు వుంచకూడదు. 9. నివసించు ఇండ్లసమీపమున కల్మష పదార్థములేవియు ఉండనివ్వకూడదు.

# 3 నిర్మలమైన నీరు.

(a) ప్రయోజనము::-

దేహసౌఖ్యమునకు పరిశుద్ధమైన గాలివలె నిర్మలమైన నీరుకూడ మిక్కిలి ప్రయోజనకారి (1) విశేషమాలిన్యము వాయువులోనుండి ఉదకములో చేరుచున్నది కనుకను, (2) మాలిన్యమును కలుగజేయుటకు కారణములైన వస్తువులు ఎప్పటికప్పుడే తొలగించి క్రమముగా వినియోగపర్చిన యడల అవి వాయువునుగాని, ఉదకమునుగాని మలినముగా జేయనేరవు గనుకను, వాయువువల్లనే ఉదకముగూడ

స్వచ్ఛముగా చేయబడగలదు. ఉదకసామాగ్రికంతటికి జన్మస్థానము వాననీరుగా భావించవచ్చును. ఆ వాననీరు భూమిమీద పడగానే కొంత భూమిలో యింకుటవల్లను, కొంత నదులలోను, చెరువులలోను పారుటవల్లను, కొంత కొండల మీద కురియుటచే మంచుఅయి వేసంగిలో ఆ మంచు కరిగి నీరగుటవల్లను యుపయోగపడుచున్నది.

(b) నీరు చెడుటకు కారణములు:-

(1) చెరువులయందలి బట్టలు వుతుకుట, స్నానము చేయుట, తోళ్లు వూరవేయుట, శంకవివృత్తి అయినతర్వాత ప్రక్షాళనము చేయుట; (2) స్మశానములు, కార్ఖానాలు, పాయిఖానాలు మురుగునీటి గుంటలు, మురుగునీటి కాల్వాలు త్రాగెడి నీటికి చేరువలో నుండుట (3) కాల్వాలలోగాని, నదిలో గాని, ఎగువ రేవులో బట్టలు వుతుకుట, దిగువ రేవు త్రాగుట మొదలగునవి.

(c) మురికినీరు త్రాగుటచే కలుగువ్యాధులు:-

(1) కలరా (2) అతిసార విరేచనములు (3) అజీర్ణము.ు (4) జ్వరములు (5) నారికురుపులు (6) నులిపురుగులు మురికి నీళ్లను తప్పక త్రాగవలసి వచ్చినచో నీళ్లను సలసల కాగబెట్టి వడియబోసి చల్లార్చి పుచ్చుకోవలెను.

(d) కాచిన నీరు త్రాగుటచే ఆపతగిన వ్యాధులు:-

(1) నారి కురుపులు (2) విషూచి (3) రక్తవిరేచనములు (4) అజీర్ణ విరేచనములు (5) ప్రేగులలో పురుగులు (6) మన్యజ్వరము.

(e) చెరువునీరు:-

త్రాగెడునీరు చెరువునీరు అయినయెడల చెరువులో బట్టలు ఉతుకుట, స్నానముచేయుట ముఖముకడుగుట. త్రోళ్లు, గోసులు, కత్రలు వగైరాలు ఊరవేయుట, గొడ్లను కడుగుట, కట్టలపై బహిర్దేశముపోవుట, కార్ఖానాలు, స్మశానాలు సమీపములోనుండుట మొదలగు చెడు అలవాట్లను మాన్పించి కాపుదారీ చేయించవలెను,

(f) బావినీరు :-

1. దిగుడుబావులవిషయమై (i) స్నానము మొదలగునవి చేయకుండ కాపాడుట, (ii) సమీపములో మురికికుండ్లు గోతులు, పేడకుప్పలు, పెంటపోగులు లేకుండాచేయుట, (iii) దిగవలసినచో ప్రక్షాళనముచేసికొనుట మొదలగు పద్ధతులు చేయవలెను. 2. (i) చేదుడుబావిఅయినచో చెట్ల ఆకులుపడకుండ బల్లలు అమర్చుట (ii) మనుష్యులకు అపాయము కలుగకుండ బావిలో గొలుసును వ్రేలాడగట్టుట (iii) బావిచుట్టు పళ్ళెం కట్టించుట (iv) మురికినీరు 30 అడుగులదూరముగానుండు స్థలమునకుచేర్చుట; గచ్చుఅరుగులతో కాల్వలను ఏర్పరచుట మొదలగునవి చేయవలెను.

(g) బావినీరు చెడుటకు కారణము :

(1) మురికినీరు మురికికుండుకు పారకపోవుట చేతను (2) కుండులోని మురికినీరు భూమిలోనికి ఊరుట చేతను

(8) స్మశానం, మురికినీటికుండు, జలదారి, పేడకుప్ప, 200 గజముల దూరములోన యుండుటచేతను.

(h) కాలువనీరు, నదినీరు :—

త్రాగెడు నీటి ఆధారము కాలువగాని నదిగాని అయినచో నీటిని 3 రేవులుగా యుపయోగపర్చుకోవలెను. మొదటి రేవు మనుష్యులు త్రాగుటకును, దిగువరేవు పశువులు త్రాగుటకును, చివర రేవు బట్టలువుతుకుటకును వుపయోగించవలెను. వీటికట్టలను బహిర్దేశమునకు నుపయోగించ కూడదు. త్రాగుటకు యుపయోగించు నీటి సరఫరా సమీపమున మల విసర్జనచేయు అలవాటు "మనువు" వలన నిషేధించబడినది.

(i) వా న నీ రు :—

వర్షము నీరు ఉపయోగించవలసి వచ్చినప్పుడు పాకలు నుంచిన్నీ, చిన్న పెంకుటి యిండ్ల నుంచిన్నీ, చూర్లమీదుగా వచ్చునీరు మంచిదికాదు. డాబాలకు ఇనుపగొట్టములనుంచి వచ్చునీరు మంచిది. గాని ముందుగా గొట్టములు శుభ్రము చేయించుకోవలెను. ఆకాశమునుంచి సూటిగా వచ్చు నీరు గంగాళాలలో పట్టుకొని వాడుట మిక్కిలి శ్రేష్టము.

(j) తోర్లిపుడునీరు :—

అనగా అంటుపాత్రలు, గుడ్డపులాయములు, స్నానపుగదులు మొదలగునవి కడిగినమీాదట బయలుదేరు మురికినీటికిన్ని. మనుష్యులు పశువులు మాత్రముకా కేగు. గూ

నీరు యింటికి సమీపములో యింక నుండుటకు వీధులలోనికి పోనియ్యకుండుటకు మురికికుండు కట్టవలెను.

(k) మురికికుండు కట్టువిధము :—

ఇంటికి షుమారు 20 అడుగుల అవతల కావలసిన పరిమాణముగల గుంటను త్రవ్వి ఒక అడుగు దళమ్ముగ మంచి గట్టి అయ్యి బంకమన్నును అడుగున మెత్తి తర్వాత గుంట యొక్క క్రిందిభాగమును ప్రక్కలను, మంచి రాళ్లతోను, సున్నముతోను లేక సిమెంటుతోను 9 అంగుళముల మొదలు 12 అంగుళముల మందముగా గోడను కట్టుము. ఇటుకరాతితో గుంటను కట్టినయెడల కరుగుచున్న కీలులో రాయిని యుంచవలెను. కుండుయొక్క గోడలు వెలుపలిభాగమున నీరు కారకుండుటకు 9" మందమువరకు బంకమన్నును దట్టనచేయవలెను. కుండుకు మూతగా రాళ్లపలకలుగాని, కొయ్యమూతనుగాని యుపయోగించవచ్చును. మురికినీరు నిత్యముగాని, కనీసము రెండురోజులకొకసారిగాని తోడించి సాగుభూములలో గాని, చెట్ల వ్రేళ్లదగ్గరగాని పారపోయించవలెను.

(l) మురికినీటిని తొలగించు విధము :—

ఇంటికి సమీపములో గాకుండ భూమిమీద త్రవ్వబడిన కాలవలోనికి పోవుటకు ప్రతికాలువ 18" వెడల్పు 18" లోతును అవసరమైనంత పొడవునుగల డ్రెయినిని నుంచవలెను. అడుగున నున్నమట్టిని త్రవ్వినమీదట నాలుగుఅంగుళములలోతువరకు కంకర లేక చితుకొట్టబడిన గులకరాతితోను అటు తరువాత 6" లోతు మట్టిలేకుండా కడిగివేయ

బడిన గులకరాయితోను పిమ్మట 6" లోతు యిసుకతోను, యిసుకను సరిగా దాని స్థానములోనుంచుటకు కడపటగా ఒకవరుస కంకర లేక చితుకకొట్టబడిన గులకరాతితోను సదరు కాలువ కప్ప బడవలెను. కాలువవోరలయందు మొక్కలు వేయబడవచ్చును. కాలువలోని పదార్థములు యింకిన తరువాతనే నీరు భూమిలోనికి జేరును. మరియు మలిన పదార్థములో చాలాభాగము యీ విధముగా వడియ కట్టి వేయబడును.

## 4 ఆ హా ర ము

(a) ప్రతిమనుష్యునకు యుక్తాహారము, సుఖనిద్ర, శుభ్రమగు వస్త్రము ముఖ్యావసరము. శరీర సాధన చేయుటయేగాక మనస్సును ఎల్లప్పుడు సుఖస్థితిలో నుంచుకొనవలయును. ఎప్పుడును దూబర తిండి తినక కడుపునకు మాత్రము కావలసినంత తినవలెను. కడుపుబ్బునట్లుగా రోజుకు ఒకసారి భోజనముచేయుటకంటె మితముగా రోజుకు రెండుసార్లు చక్కగా వుడికినకూరలు మొదలగునవి సమయానుకూలముగా ఉపయోగించుకొనుచు జాగ్రత్తతో భోజనము చేయవలెను. తినుపదార్థములను బాగుగా నమిలి మరీ తినవలెను. మద్యపానము ఎన్నటికి పనికిరాదు. ధూమముక్రింద పచనము చేశినవి, సారహీనము లైనవి, దుర్వాసనగలవి, వకరు భక్షింపగా మిగిలిన యెంగిలి తినరానియాహారము. మిగులచేదు, పులుసు, ఉప్పు, వేడి, తీక్షణము, మోటు, విదాహియగు నాహారములు దుఃఖరోగకరములైనవి. రాత్రిళ్లు పాలు

పండ్లు తీసుకొనుట మంచిది. ఆహారమునకు సంబంధించిన కార్యములు రెండు. 1 దేహమును వృద్ధిజేయుటయు, మరమ్మతు చేయుటయు, 2 పనిచేయుటకు కావలసిన శక్తిని, వుష్ణమును నిచ్చుటయు అయివున్నది.

(b) ఆహారముచెడుటకు కారణములు :-

(1) ఈగలను ఇతరపురుగులను ఆహారపదార్థములపై వ్రాలనిచ్చుటచేత (2) పాలు, మాంసము, పండ్లు, అన్నము నిలవయుంచుటచేత పాసిపోవును గనుకను (3) కొన్ని పనికిరాని పాత్రలలో ఆహారపదార్థములు వండుటచేతను, నిలువయుండుటచేతను చెడును.

(c) ఈ గ పు ట్టు క :-

కీటకములన్నిటిలోను ఈగ మిగుల అపాయకరమైనది. మురికిలోపుట్టి, మురికిలోనివసించి, మురికినితిని, మురికిని వెంట గొనిపోవుచుండును. పాకీదొడ్లు, ఎరువు, చెత్త మొదలగు దిబ్బలలో బాగా వృద్ధిపొందును.

(d) ఈగవల్ల వచ్చువ్యాధి :—

మురికినిగొని ఆహారపదార్థములపై వ్రాలును. అందువలన ఆహారములు తినినవారలకు కలరాగాని, మలకోశ సంబంధమగు యితర జాడ్యముగాని వచ్చి మరణించుట తటస్థమగును. యిట్టి అపాయమునుండి తప్పించుకొనుటకు (1) యింటిసమీపమున చెత్తనుగాని పేడనుగాని, ఎరువునుగాని, నిలువజేయకుము. (2) చెత్తను కాల్చివేయుము. ఎరువును

పూడ్చి వేయుము, పాకీదొడ్లను శుభ్రముగానుంచుము. (3) ఆహారమును, పానీయమును మూతపెట్టియుంచుము. (4) ఈగలు ముసురుకొనుచున్న ఆహారమును భుజింపకుము. (5) నీ కగబడు ప్రతి ఈగను చంపివేయుము.

## 5 స్మశానములు

స్మశానములు గ్రామమునకు అరమైలులోపుగా వుండకూడదు. త్రాగెడునీటికి దగ్గరలోనుండకూడదు. 6' లోతున సమాధి ఉండవలెను. స్మశానము గ్రామముకు ఉత్తరంగాగాని తూర్పునగాని ఏర్పరచుకోవచ్చును.

## 6 జంతు కళేబరములు

(a) 1. ఒకజంతువు మృతిచెందినయడల దానివ్యాధి యితర జంతువులకు వ్యాపించకుండా నుండుటకు కాల్చివేయవలయును. 2. కాల్చుటకు వీలులేనియడల దానితోలు తీయకుండా తాజాసున్నములో 6 అడుగుల లోతున పాతిపెట్టవలెను 3. దొమ్మవ్యాధివల్ల చనిపోయిన జంతువు స్థలమునుయావత్తు గడ్డితోగాని పిడకలతోగాని కాల్చివేయుము. 4. వ్యాధిపడు జంతువుయొక్క రక్తము మనుష్యులచర్మము అంటకుండుటకు జాగ్రత్తపుచ్చుకోవలెను.

(b) పశుజాడ్యములు :

19-3 సెక్షనులో అంటువ్యాధులవలనను, అడవిమృగములవలనను, విషముపెట్టుటవలనను, పాముకాటువలనను

చచ్చిన అస్వాభావిక పశు మరణముల మాత్రమే వ్రాయవలెను. పశువులకు వచ్చు అంటువ్యాధులు 7 విధములు.

1. దొమ్మ (Renderpest) పశువుల మహామ్మారి, నెరడి, పెద్దముసర, అన్ని జంతువులకు వచ్చు అపాయకరమైన వ్యాధి.
2. సరకు (Antharax) వచ్చికబయళ్ళను మేసే పశువులకు వచ్చి తక్షణం చనిపోవును.
3. జబ్బవాపు (Black quarter or quarter ill) 6 నెలలు; 2 సం॥ రంలలోపు దూడలకు డెల్టాకాని ప్రదేశమునందు మే నెల నుండి డిశెంబరు లోపల వచ్చును.
4. గొంతునొప్పి ఊపిరితిత్తులవ్యాధి, పేగులవ్యాధి, గురక రోగం గొర్రెపిల్లలకు వచ్చును.
5. చెంచ(Sheep pox) గొర్రెలకు సూచికబొబ్బలు లేచును.
6. సర్రా(Surra) గుర్రములకు గాడిదెలకు,ఒంటెలకువచ్చును.
7. గాళ్లు, చీలినగిట్టలు గల అన్ని జంతువులకు వచ్చును. దీనికే కాలిగుంట, నోటిపూంత అందురు,

యీవ్యాధులు రాకుండ పరిసరగ్రామాదుల నుంచి వచ్చు పశువులను బయట 10 దినములవరకు కట్టియుంచి, పరీక్షించి రానీయవలెను. వ్యాధి కనుపించిన ప్రత్యేకజిల్లాను నుంచి తహాస్శీలుదారుకు-వెటర్నరీ ఇనస్పెక్టరుకు నియమించిన నమోనాలో దినసరి రిపోర్టు పంపవలెను. దొమ్మరోగము తెలిసియుండియు కళేబరము కోసినయెడల ఇండియన్ పీనల్ కోడ్డు 269-270 శెక్షన్ల క్రింద నేరమైయున్నది.

(c) బేవార్సు శవములు :

అనాథ మనుష్యుల కళేబరములను మ్యునిసిపల్ సరిహద్దులలో మ్యునిసిపాలిటివారున్ను మిగతాచోట్ల గ్రామాధికారి పాతిపెట్టించి అందుకు అగు ఖర్చు మేజస్ట్రేటుకు బిల్లు పంపి తెప్పించుకోవలెను.

## 7 పేడకుప్పలు

పేడకుప్పలు

గ్రామమునకు 300 గజములదూరములో చెత్త చెదారపు కుప్పలు ఉంచవలెను. నిడుపాటి కాల్వలో పూడ్చివుంచి వ్యవసాయకార్యములకు అవుసరమగునప్పుడు తీసుకొనవలెను. మూడేసిదినముల కొకసారి రెండు, మూడు అంగుళముల ఎత్తుగా ఆఎరువుమీద పొడిమట్టి వేసినయడల దుర్గంధము ఆపవచ్చును.

## 8 పాయఖానాలు

1. స్వంత పాయఖానాలు. 2. సర్కారు పాయఖానాలు. అని రెండువిధములు.

1. స్వంత పాయఖానాలు

అనగా స్వంతయుపయోగముకొరకు ఆరోగ్యశాస్త్రానుసారముగా కట్టినవి. మలమూత్రాదులు దుర్గంధము పుట్టకుండుటకు విసర్జించు నట్టి శేల దానిక్రిందికి యింకకుండునట్లు,

చేమన్నతగలకుండునట్లు గట్టిగానుండుటకు నీళ్ళసర్ఫరాకు కొంతదూరముగా 13'' లోతుకుమించని త్రెంచిని త్రవ్వి అందులో మలమును పూడ్చవలెను. మలముమీాద ఎండిన మన్నును వేసినయడల దుర్గంధముపోవును. యివి రెండువిధములు.

(a) తొలచినరంధ్రముల పాయఖానా

14'' అంగుళములు అడ్డకొలత కలిగినట్టియు 10' నుండి 20 అడుగులవరకు భూమిలోనికి తొలువబడినట్టియు గుండ్రని రంధ్రము, కూర్చొనుటకు అనువగు రాతితోను సున్నముతోను చేయబడిన ఒక పలక రంధ్రముమీాదనుంచబడి సదరు పలకచుట్టు 5' నుండి 6' అడుగులు ఎత్తుగల మట్టిగోడ కట్టబడును. మట్టిగోడకుబదులుగా దుత్తునాగపు రేకుతో లేదా ఆకులతో దడి కట్టబడవచ్చును. ఇంటికి వుపయోగపడే ఏ జలాధారమునకైనను 100' దూరములో యీా పాయిఖానా యుంచబడును.

(c) గుంటపాయిఖానా :-

6' లోతు 3' చదరముగల ఒకగుంటను త్రవ్వి పాయఖానాలో ఒకనికంటె ఎక్కువమంది కూర్చొనుటకు మనిషికి 3' చొ॥ న పొడవు పెంచి యిసుకపోసి పల్లముగానుండు ప్రదేశములో లోపలికి తొలుచుకొనిపోకుండుటకై గుంట మూతివెడల్పుగానుండి అడుగునకు ఏటవాలుగా నుండవలెను. గుంటపైన రాతితోను సున్నముతోను చేయబడిన అరుగు

(Platform) కట్టబడవచ్చును. మరుగునిమిత్తం అరుగుచుట్టు ఏదైన దడి మొదలగునవి కట్టుకొనవచ్చును. గుంటలోనుండు పదార్థము అరుగుమట్టముకు 3' వరకు వచ్చిన అరుగు తొలగించి అట్టిదే మరొకచోట నిర్మించుకొనవచ్చును. గుంటలో కొద్దిగా నీరు విడువవలెను. దోమలుచచ్చుటకు వారముకు నిండుగిన్నెడు కిరసనాయిలుపోయవలెను. ఎండిన గుఱ్ఱపు లద్దెకూడ ప్రతివారము వేయించవలెను. ఇట్లు వేయుటలో మలము త్వరగా భిన్నమగుటకు వీలగును. పై రెండువిధములగు తొలిచినగుంట పాయఖానాలకు కన్నపుమరుగు దొడ్లు అని పేరు. గుంటపాయఖానాలు పల్లపు ప్రదేశములో కట్టకూడదు. నీటి సరఫరాకు 50 అడుగులదూరములోపు కట్టకూడదు.

2. సర్కారు పాయఖానాలు :-

అనగా గ్రామస్థుల వుమ్మడి అనుభవ కార్యముల కొరకు నియమించిన స్కేలు ప్రకారం పబ్లికు స్థలములందు స్త్రీ పురుషాదులకు వేరు వేరుగా కట్టబడును.

(a) తాత్కాలికపు సర్కారు పాయఖానా కట్టువిధము :-

ఒక స్థలముచుట్టును 6' వెడల్పును తగినంత పొడవు యుండునట్లు తాటియాకులతోను తడికలతోను యిండ్లకు నీటిసరఫరాకు దూరముగా భూమిమట్టమున 18'' వరకు మట్టినితీసి ఆకాలువలో 6'' బొంత లేక కంకరరాతితోను పిమ్మట 8'' గులకరాతితోను తరువాత 6'' నుంచి ముతక

యిసుకతోను పూడ్చవలెను. ఇసుక పైభాగమున విడిచి పెట్టబడిన అశుద్ధము అశుభ్రముగా తొలగింపబడవచ్చును. మూత్రము, కడుగుకొన్న నీరు హానిలేకుండా యింకిపోవును.

(b) పాకీవాండ్రులేనిచోట గ్రామపాయిఖానాలు నియమించుట:

1' వెడల్పు 1½'లోతు 25' పైగా నిడివిగల ఒక కెంచిని త్రవ్వి మట్టిని కాల్వయొక్క ప్రక్కను యుంచవలెను. మరుగుగానుండుటకు కాలువచుట్టు తడికలను కట్టవలెను. బహిర్దేశమునకు పోవువాడు రెండుపాదములు రెండు వైపులనుంచి కెంచిలో కూర్చొనవలెను. లేచిపోవునపుడు అశుద్ధముమీద కాలితో కొంతమట్టిని త్రోయవలెను. కాలువ పైనుండి 6" లోతువరకు కప్పివేయబడినపుడు 6 మాసములవరకు దానిని పూర్తిగామూసివేసి పిమ్మట ఎరువుగా మారిన మలమట్టిని దున్నిగాని తీసిగాని సాగుపొలములకు యుపయోగించవలెను. కాలువ పూడినపుడెల్ల యీ పైవిధముగానే కాలువ ఏర్పాటుచేసుకోవలెను.

(c) పాకీవాండ్రను నియమించుట :

వీధులను బాగుచేయుటకు 1000 మనుష్యులకు 1 పాకీవాడు కావలయును. 500 మనుష్యుల మలమును శుద్ధము చేయుటకు 1 పాకీవాడు చాలును. సర్కారు పాయఖానాలు, స్వంతపాయఖానాలు రెంటిని శుద్ధిచేయుటకు 200 మందికి ఒకడు చాలును. పాకీవాండ్రులేనిచోట మలసవిసర్జనము సరిగా శుభ్రపరచక పందులు కుక్కలు,కోళ్లు, మొదలగునవి

భూభాగము చిందరవందర చేసి యితరులకు ఎక్కువహాని కల్గించును. గనుక పాకీవాండ్రు అవుసరము.

(d) పొలములో బహిర్దేశముపోవుట :

పొలములో ఒకమూరలోతు ఒకమూర వెడల్పుగల ఒక చిన్నగోతినిత్రవ్వి సదరు గుంటమీద కూర్చొని గోతిలో మలవిసర్జనముచేసి విడిమట్టిని కాలితో త్రోయవలెను. కొంతకాలమునకు అది ఎరువై పొలమునకు బలమునిచ్చును.

(e) మలమూత్రాదులు పరిష్కరించువిధము :

సర్కారు పాయఖానాలనుండియు, ఖానిగీ పాయఖానాలనుండియు చేర్చబడు మలమూత్రాదులు తోటలలోను పొలములలోను నుంచుటకు 1' లోతున్నూ 1' వెడల్పున్నూ ఒకదానికొకటి 1' దూరముగల కాలువనుత్రవ్వి అందులో నుంచవలెను. మలము 3' లోతుమాత్రమేయుంచి మట్టితో కప్పివేయవలెను. ఇట్లుచేసినయడల 9" మట్టి పైన వుండగలదు. కొన్ని నెలలకు ఈభూమి శేద్యముచేయవలెను. కూపముగోతి పాయఖానాలకు కావలసిన పనిముట్లు గ్రామారోగ్య సంస్థాపనవారు అసలు ధరకు కావలసివారికి సర్ఫరా చేయుదురు. గ్రామారోగ్య సంస్థాపన (Rural Sanitation Unit) వారు గాని, డిస్ట్రిక్టు హెల్తుఆఫీసరుగాని, పాయఖానాలు నిర్మించువిషయమునను, నీటిగుంటలను త్రవ్వుటయందును సలహాయిచ్చుట వాటినిర్మాణములో సహాయము చేయుట వాటికి కావలసిన పలకను అసలుధరకు సరఫరా చేయుటకు యెల్లప్పుడు సిద్ధముగానుందురు.

(f) ఎక్కడపడితే అక్కడ పొడిచేయుట :

పట్టణములోను పల్లెలలోను జనులు బహిరంగప్రదేశములందును, గ్రామకంఠం బాటలుప్రక్కను, కాలువలు ప్రక్కను, బహిర్దేశముకుపోయి కల్మలము చేయుచున్నారు. ఇందువల్ల జలాధారములు ముఖ్యముగా పాడైపోయి ఘోరమైన ప్రేగులవ్యాధులు వచ్చుచున్నవి. పాయఖానాకు వెళ్ళునప్పుడు కాళ్ళకు చెప్పులులేకుండా వుండుటచేతను అది అయినతరువాత కాళ్ళు సరిగా కడుగుకొనకపోవుటచేతను కొంకెపురుగులు శరీరములో ప్రవేశించుటవల్ల ఘోర ప్రేగుల వ్యాధివచ్చును. ప్రేగులవ్యాధిచే బాధపడు ప్రతిరోగికి ప్రేగులలో వేనకువేలు వ్యాధిక్రిములుండి అవి తమ విరోచనముల ద్వారా వెడలగ్రక్కుటచే ఆరోగ్యవంతులగువారు బహిర్దేశములకు వెళ్ళినప్పుడు వాళ్ల కాళ్ళకు అంటుకొని దుమ్ముతో యింటికిచేరి ఆహారపదార్థములను పాడుజేయును. గనుక ప్రతియింట పాయఖానాను ఏర్పరచుకొనునట్లును, బీదవారలకు స్థానికసంస్థలు ఏర్పరచునట్లును గ్రామాధికారి బోధింపవలెను.

---

## 2. వ అధ్యాయము

# అంటువ్యాధులు

### గ్రామాధికారి పనులు

అంటువ్యాధులనగా కలరా, మశూచికం, పొంగు, టైఫాయిడ్, ప్లేగు, క్షయ, బంకవిరేచనములు, కుష్టు, యేనుగుకాళ్లు (లేకబోదకాళ్లు చేతులు వగైరాలు) (filaria), యిన్‌ఫ్లూయింజావలన వచ్చిన నిమోనియా, ఆన్‌త్రాక్సు, సెరిబ్రోస్పైనల్ జ్వరము, డిఫ్తీరియా, ఎన్‌టిరిక్ జ్వరం, కుక్కకాటువలన కలిగిన పిచ్చి, రిలాప్సింగ్ జ్వరం, స్కార్లెట్ జ్వరం, కుష్ఠు మొదలగునవి. అంటువ్యాధులు ఒకరి నుంచి వేరొకరికి సోకునవి. ఒక గ్రామములో అసాధారణమైన జబ్బు ఏదైనకనుపడినయడల డివిజనల్ అఫీసరుకున్నూ, డిస్ట్రిక్టు హెల్తుఆఫీసరుకున్నూ తెలియచేయుగలందులకు ఆసంగతి గ్రామహెడ్డు తహశ్శీల్‌దారుకు తెలియజేయవలెను. విషూచి, స్ఫోటకము, ప్లేగు లేదా అనేకులకు ఏకకాలమందు తగిలే యితరవ్యాధులు సంభవించేటప్పుడు గ్రామహెడ్డుగాని అతనిగైరుహాజరులో కర్ణముగాని తహశ్శీల్‌దారుకున్నూ, హెల్తుయిన్‌స్పెక్టరుకున్నూ తెలియపర్చవలెను. మ్యునిసిపల్ టవునుకు 5 మైళ్ళ దూరములోనున్నప్పుడు మ్యునిసిపల్ కౌన్సిల్ చైరుమన్‌కు రిపోర్టుచేయవలెను. అర్జంటు కేసులలో ప్రత్యేకమనిషిద్వారాగాని, టెలిగ్రాంద్వారాగాని తెలియపరచవలెను. ఏ గ్రామములోనైనా మలేరియాగాని

ఇతరజ్వరములుగాని వారమునకు గ్రామజనాభాలో నూటికి ముగ్గురికంటె యెక్కువమందికి తగులుచూయుండే యెడల గ్రామాధికారి తహశ్శీలుదారుగారికిని హెల్తుఇనస్పెక్టరుకును రిపోర్టుపంపవలెను. సదరు రిపోర్టులలో మలేరియా కేసులు ఎన్ని అయినదియు, ఇతరజ్వరములు ఎన్ని అయినదియు వివరముగా వుదహరించవలెను. వ్యాధులన్నిటిలోను ప్రబలమగు వ్యాధులు మూడు 1. కలరా. 2. ప్లేగు. 3. మశూచకము. యిందులో మనుష్యప్రయత్నమువల్ల ఆపదగినది మశూచకము. మందులేనివ్యాధి ప్లేగు. చికిత్సకు అవకాశముగలది కలరా.

# 1 కలరా

కలరా అనగా విషూచి లేక గ్రహణి. దేశరివాజును బట్టి దీనికే వాంతిబేధి, గొట్టాలమ్మ, తుడుపులమ్మ అని వాడుదురు.

(1) కలరాయొక్క లక్షణములు :-

పలుచని గంజివలె నుండు విరోచనములు, వాంతులు, కాళ్లుచేతులు యీడ్చుకొనిపోవుట, మూత్రము బంధించుట మొదలగునవి.

(2) వ్యాధివచ్చుటకు కారణము :-

మురికినీరు త్రాగుటవల్లను, కుళ్లినపదార్ధములు తినుటవల్లను, అమితముగా భుజించుట, అర్ధాకలి, ఈగలు, దోమలు, మురికిపంటలు, భయము, మొదలగువాటివల్ల కలుగుచున్నది.

(3) ఇరుగుపొరుగున కలరావున్నప్పుడు ముందు జాగ్రత్తలు :-

(a) వాసస్థానము : 1. కల్మషపదార్థములు లేకుండా యింటిని శుద్ధిచేయుట. 2. స్వంత పాయఖానాలు రోజుకు రెండుసార్లు కడుగుట. 3. మురికికుండ్లలోను గోతులలోను ఏమీ లేకుండా చేయుట.

(b) దేహము : 1. అజీర్ణభేదులు కలుగజేయు పండ్లను కూరలను, పదార్థములను తినకుండుట. 2. భేధిమందులు పుచ్చుకొనకుండుట. 3 అతిసారభేదులను ఆపివేయుట. 4. కాచిన నీటిని త్రాగుట. 5. ఉప్పును ధారాళముగా నుపయోగించుట. 6. ఈగలను ఆహారముమీద వ్రాలకుండా చేయుట. 7. వేడిపదార్థములు పుచ్చుకొనుట. 8. రాత్రిళ్లు విశేషముగా మేలుకొని యుండకుండుట.

(c) నదులు : నదినీరుగాని, కాలువనీరుగాని, వాగు నీరుగాని త్రాగవలసివచ్చినప్పుడు మూడుభాగములుగా రేవులను కట్టించవలెను. ఎగువరేవు త్రాగుటకును దిగువ రేవు పశువులు త్రాగుటకును, అంతకంటె దిగువ రేవు బట్టలు వుతుకుటకును వుపయోగించవలెను. పట్టణమునుండి వచ్చు జలదారులు దిగువరేవుమీదుగా వచ్చునట్లు చేయవలెను.

(d) బావులు : బావిలోని నీళ్లను మట్టికుండలు, లేక యినుప పాత్రలవలన చేదుకొనవలెను. దిగువ బావులలో స్నానముచేయుట, మురికిపాదములతో దిగుట మొద

లగువాటివల్ల నీరు కల్మషమగును. గనుక వాటిని తాత్కాలి కముగా మూండ్లతోగాని, కర్రలతోగాని మూసివేయవలెను.

(e) చెరువునీరు : బావులకంటె చెరువులు ఎక్కువ జాగ్రత్తగా నుంచుటకు ఒకమనిషిని కావలాయుంచి కల్మ షము కలుగజేయు యేపని చేయకుండా చూడవలెను. కల్మ షముపడిన బావులు, చెరువులు. మెడికలు ఆఫీసరువల్లనైనను, హెల్తు యిన్ స్పెక్టరువల్లనైనను సోకుడు నివారణచేయు వరకు వెంటనే మూసివేయవలెను.

(f) జలదారులు : ప్రతిరోజు నీళ్లుపోసి కడిగి శుభ్ర పరచవలెను.

(g) పెంటలను పరిష్కరించుట : అన్నివిధములగు పెంటలను ప్రతిదినము ఎత్తివేయవలెను. వ్యయమగునట్లు తోచిన సున్నపు ఆవములవలెనుండు చిన్న గళ్లుకలిగిన ఇన్ సిన రేటరు అను మట్టియంత్రములో కాల్చివేయవలెను. అట్టి యంత్రములోని బూడిదను సాగుచేయు నేలకు ఎరువుగా ప్రయోగించుకొనవచ్చును.

(4) కలరా సోకుడుగల స్థలములలో తీసికొనవలసిన ముందు జాగ్రత్తలు :-

(a) గృహము : 1. విషూచి పీడితుల మలమును వాంతిని చెట్లలోనికి వర్జింపజేసి క్రొత్తసున్నముగాని, డిస్ యిన్ ఫెక్టెంటుగాని మలముమీదను వాంతిమీదను కప్ప వలెను. 2. నేలమీదపడిన మలము వాంతిగలచోటున సున్న ము వేసి నేలను త్రవ్వవలెను. లేదా ఎండుగడ్డితోగాని పిడ

కలుతోగాని కాల్చివేయవలెను. 3. రోగియొక్క దేహమును తుడుచుటకు ఉపయోగించు ఏ గుడ్డను అయిన కాల్చివేయవలెను.

(b) విషూచీ మలమూత్రాదులను పరిష్కరించుట : కలరా రోగులయొక్క మలమూత్రాదులను పొడిరంపపు పొట్టుతోగాని కసవుతోగాని ధాన్యపు ప్రూకతోగాని కొంచెము కిరసనాయిలుతో కలిపి కాల్చివేయవలెను. లేదా దూరమున సున్నముతో కలిపి పాతిపెట్టవలెను.

(c) సోకుడుగల బట్టలు: మలినముచేయబడిన యావత్తు బట్టలుతగులబెట్టవలెను. లేదా కనీసము రెండుగంటలు నీటిలో ఉడకబెట్టవలెను. క్రెసాల్ యొక్క లేదా అటువంటి సోకుడును నివారణచేయునట్టి వస్తువుయొక్క సొల్యూషన్ లభించు నెడల అట్లుచేయబడుటకు ముందు దానిలో ½ గంటవరకు నానబెట్టవలెను.

(d) రోగులను ప్రత్యేకముగా నుంచుట: గ్రామమునకు వెలుపలగా బయలుప్రదేశములో ఆసుపత్రిపాకలు వేయించవలెను. స్వంతముగా వసతికలిగియుండనివారికి ఆపాకలలోనే చికిత్సచేయించవలెను. 2. కలరా రోగిని కనిపెట్టుకునియుండు ఏమనిషిఅయిన త్రాగుటకై నీటియొక్క ఏజలాధారము వద్దకైన వెళ్ళనియ్యకూడదు. 3. రోగికి నీరు తెచ్చుటకు తగిన సాటికులమువారిని ఏర్పాటుచేయుట గ్రామాధికారి విధి.

(e) కలరా తగలకుండ టీకాలు వేయించుకొనుట : ఆరోగ్యశాఖవార్లు ఈవిషయములు ఏర్పాటుచేసినచోట

కలరా టీకాలు వేయించుకోవలెను. కలరావ్యాధి రాకుండా యినాక్యులేషన్ చేయించుకోవలెను. అందువలన 6 మాసములవరకు భయములేదు. దీనికిగాను ఉపయోగించుమందు గిండీలో కింగుఆసుపత్రిలో తయారగుచున్నది. అందువలన దీనినుండి ఏలాటిఅపాయములేదు. యధాప్రకారం వారి పనులు నెరవేర్చుకొనవచ్చును.

5 కలరారోగికి చికిత్స :

1. ఏరోగముకైనా ఫలానామందుఅని చెప్పవచ్చును గాని కలరావ్యాధికి ఫలానా ఔషధము అని చెప్పుటకు వీలు లేదు. ఏయే మందులు కలరా సూక్ష్మజీవులను చంపగల్గునో ఆమందులు కలరావ్యాధికి తగినమందులని చెప్పవచ్చును. 2. ప్రతిగ్రామాధికారి హెల్తుయిన్‌స్పెక్టరువద్దనుంచి తగిన మందులు తెప్పించి దగ్గరవుంచుకుని రోగికివాడవలెను. హెల్తుయిన్‌స్పెక్టరువచ్చు పర్యంతం గ్రామాధికారియే సామాన్యచికిత్స చేయవలెను. 3. నీరు సలసల మసలబెట్టి చల్లార్చి వడియబోసి యివ్వవలయును. 4 గ్రామానికి దూరముగా రోగులకొరకు ఆస్పత్రిపాకలు వేయించవలెను. 5. రోగికి చికిత్సచేయువాడు తనచేతులను శుభ్రపరచుకొనకుండా ఏవస్తువును ముట్టుకొనకూడదు. 6. వేపమండలు కట్టించవలెను. 7. మురికిగుండ్లు,పాయఖానాలు శుభ్రముగా కడిగించుతూ డిస్ఇన్‌ఫెక్టెంటుగాని పెర్‌క్లోరైడ్ ఆఫ్ మెర్క్యురీగాని చల్లవలెను.

6. రోగి చచ్చిన తర్వాత :

1. కులాచారమునకు విరుద్ధము గానియెడల శవమును తగులబెట్టించవలెను. పాతిపెట్టించవలసినచో 6' లోతున గొయ్యితీసి ఉప్పువేసి శవమును గోతులోపూడ్చిన తర్వాత మట్టిపైన డిస్ ఇన్ ఫెక్టెంటు చల్లవలెను. 2. వీధులగుండా శవమును తీసికొనిపోవుటకుపూర్వము 500 కు 1 వంతు చొ॥న క్రెసాల్ లేదా సాపోనిఫైడ్ కలిపి లేదా పెర్ క్లోరైడ్ ఆఫ్ మెర్క్యురీఅను ద్రావకములో ఒక తెల్లటిదుప్పటిని ముంచి శవముమీాద కప్పవలెను.

7. యింటియొక్క సోకుడు పోగొట్టుట :

యింటిలోనుండిపోవు తూములనిండా 100కి 1 భాగం చొ॥ సాపోనిఫైడ్ క్రెసాల్ సొల్యూషన్ ప్రవేశింపజేయవలయును. లేదా బియ్యపుగంజివలె చిక్కగానుండు కొత్తసున్నపునీళ్ళను ఉపయోగించవలెను. 2. రోగియొక్క వాంతిచోటుగాని, విరోచనముచోటుగాని 4" లోతువరకుత్రవ్వివేసి మట్టినితీసి పొలములో పారవేసి పాతిపెట్టవలెను. త్రవ్వబడిన భాగము తాజామట్టితో పూడ్చవలెను. 3. యింటికి సున్నం కొట్టించవలెను. 4. హెల్తుఆఫీసర్లు సలహాపొందువరకు యింటి నూతినీరు త్రాగకూడదు. ఖరీదులేని ప్రక్కబట్టలను తగులబెట్టవలెను. ఖరీదుగలవి 1000 కి 1 భాగం చొ॥ పెర్ క్లోరైడ్ ఆఫ్ మెర్క్యురీ అను ద్రావకములో నీళ్లుపోసి కనీసం2గంటలువరకు ఉడకబెట్టవలెను. లేదా½గంటసేపు నానబెట్టవలెను. 5. ఆహారపాత్రలన్నిటిని చేతితో ముట్టు

టకు వీలులేనంత వేడి ఎక్కువరకు నిప్పుతో కాచవలెను.
6. కర్రసామానులన్నిటిని కళపెళకాగు నీళ్లతో శుభ్రము చేయవలెను.

8 బావులకు పోకుడు నివారణచేయు మార్గము :

1 షుమారు 4' మధ్య కొలతయు 6' నీరునుగల ఒక బావి విషయములో రెండు తులముల బ్లీచింగు పౌడిని తీసుకుని దానిని సగము బకెటు నీటిలోముంచవలెను. సదరు బకెటును నీటిలోముంచి కొన్నిసార్లు బయటికి క్రిందకి లాగిన యడల బకెటులోనినీళ్లుఅన్నియు బావిలోనికి పంచినట్లుగా సరి పోవును. 2. పెద్దబావుల విషయములో దామాయిషీ ప్రకారం ఎక్కువబ్లీచింగుపౌడరుయుపయోగించవలెను. బ్లీచింగుపౌడర్లు హాజరు లేనియడల పొటాసియం పర్మాంగనేటు వుపయో గించవచ్చును. బావిలోని నీరు కనీసం 12 గంటలవరకు లేత కావిరంగు కలిగియుండుటకు అవసరమైనంత పొటాసియం పర్మాంగనేటును కలుపవలెను. గ్రామాధికార్లు ఎల్లప్పుడు కొంతమంచి బ్లీచింగు పౌడిని కలిగియున్న డబ్బా లేదా సీసా ఎప్పుడు గట్టిగా బిగించి యుంచి అవసరమైనప్పుడు వుపయోగించవలెను.

## 2 ప్లేగు

దీనినే బొబ్బలవ్యాధి, ఎలుకవ్యాధి, లేక మహా మ్మారి అందురు.

1. ప్లేగువచ్చుటకు కారణములు :

1. మిక్కిలి సూక్ష్మమైన గ్రుడ్డువంటి క్రిమివలన కలుగుచున్నది. ఈ గ్రుడ్డు ప్లేగు సోకిన యెలుకల శరీరములో వాటి రక్తములో పెరుగుచున్నది (జంతు శరీరములకు వెలుపల అది బ్రతికియుండజాలదు.) 2. ఎలుకలను ఆశ్రయించుకొని యున్న మిణ్ణల్లి పురుగులు వాటి రక్తమును పీల్చుకొని బ్రతుకును. ఈ పురుగులు జంతువునుగాని, మనిషినిగాని కుట్టినపుడు వ్యాధివచ్చును.

2. ప్లేగు రోగ చిహ్నములు :

1. విడువని తీవ్రమైన జ్వరము 2. మిక్కిలి రోతగా నుండు నాలుక. 3. శరీరము, తల నొప్పిగా నుండుట 4. గజ్జలలోను, చంకలలోను బిళ్లలుకట్టుట 5. బ్యూబోస్ అను బొబ్బలు. 6. బలమైన దగ్గు 7. వుమియుటకు, వూపిరిపీల్చుటకు, కష్టమగుట.

3. ప్లేగు రాకుండా చేయు మార్గము :

1. సోకుడుగల ప్రదేశమునుండి వచ్చు మనుష్యులకు ప్యాసుపోర్టుల నేర్పరచి మెడికలుపరీక్ష చేయించి గ్రామములోనికి రానీయవలెను. 2. ఎలుకలను నిర్మూలము చెయ్యవలెను. మిణ్ణల్లి పురుగులను కలిగియుండు సరకులను గ్రామములోనికి రానీయకుండా వూరుబయటనుంచి సరకులను విమ్మరించి 8 గంటలవరకు ఎండలో నుంచి ప్రతి ఘంట ఘంటకు పొర్లించుచుతూ యుండవలెను. వాటిలో ఎలుకలు

కనబడినయెడల ఎలుకలను చంపి కిరసనాలతో తడిపి వెంటనే కాల్చివేయవలెను. 3. మనుష్యులను వూరుబయట 3 గంటలవరకు యుంచి బట్టలను పడకవస్త్రవులను ఎండబెట్టి లోపలకు రానీయవలెను.

4. గ్రామములో ప్లేగుయున్నప్పుడు చేయవలసిన పనులు :

1. గ్రామములో విస్తారము ప్లేగుగా నున్నప్పుడు 2 నెలలవరకు వూరువిడిచిపెట్టవలెను. 2. గ్రామములోని యావన్మంది టీకాలు వేయించుకొనవలెను. 3. గ్రామములోని ఎలుక లన్నింటిని చంపించివేయవలెను. 4 ఇండ్లు, శరీము శుభ్రముగా నుంచుకొనవలయును. 5. ప్లేగుకు చికిత్స లేదనియు ప్రయోజనకారి కావనియు జ్ఞాపకము నుంచుకొని ముందు జాగ్రత్తలు పొందుచుండవలెను.

5. ప్లేగు నెమ్మదించిన తర్వాత చేయు పనులు :

1. నేలను వరిగడ్డిచెత్తతో కాల్చివేయువలెను. 2 కొయ్యసామానుల పైన మసలుచున్న నీటిని పోయువలెను. 3. మంచి గుడ్డలను ఎండబెట్టవలెను. 4. పాకలను తగుల బెట్టించవలెను. లేనిచో సున్నము కొట్టించవలెను.

6. ఎలుకలు ; రకములు

ఎలుకలు మూడురకములు 1. చూరుఎలుకలు 2. చిట్టి ఎలుకలు 3. పొలమెలుకలు. పొలము ఎలుకలు పొలములోని పైర్లనుపాడుచేయునే కాని మనుష్యులకు అపాయము చేయజాలవు. చూరుఎలుక ఆ యింటిలోనివారికే హాని కలుగ

జేయును. చిట్టెలుక మిక్కిలి అపాయకరమైనది ఒకయింటినుంచి మరియొక యింటికి ప్లేగు వ్యాపింప చేయును. ఏయింటిపై నుంచి ఎలుక క్రిందపడి చచ్చునో ఆ యింట ప్లేగు యున్నట్లుగా గ్రహించవలెను. అందుకు ఎలుకలను చంపుటముఖ్యావసరము.

7. ఎలుకలను చంపుమార్గము :

బోనులమూలముగాగాని విషముగల యెరలమూలముగాగాని చంపవచ్చును. ఇంటిలోనుండగల యేవైనా మిణ్ణల్లులను కిరసనాయిలుతో సబ్బుకలిపిన ఎమల్షనుతో గోడలను నేలను కడుగుటవలన చంపవచ్చును.

కిరసనాయిలు ఎమల్షను తయారుచేయుట ఎట్లనగా: కిరసనాయిలు డబ్బాలోసగమువరకునీరుపోసిమరగ బెట్టుచుండగా నాలుగుసీసాల చౌకరకము కిరసనాయిలు కలుపవలెను. యీ వేడిగానున్న ద్రవములో తెల్లగానుండు మరగ యేర్పడి కిరసనాయిలు ప్రత్యేకముగా లేకుండునంతవరకును చౌకయైన సబ్బుముక్కలను దానిలో వేయుచూ కలియబెట్టవలెను.

8. ఎలుకలు బ్రతికియుండగా పట్టుకొనుట :

ఇందుకు పిండితరహాబోను మంచిది. ఎలుకలు యుక్తిగలవి. అనుమానముగలవి. అందువల్ల ఎరలు ఎక్కువగా మార్చుచుండవలెను. బోనుగాని, యెరనుగాని ఎన్నడు చేతితో ముట్టకూడదు. వేయించిన చేప, మాంసము, వుల్లిపాయ, కొబ్బరి వుపయోగించవలెను. లేదా బేరియంకార్బనేట్ అను విషము పిండి గంజి మొదలగువాటితో కలుప

వచ్చును.పట్టుకొనబడిన ఎలుకలను అవియున్న చోటనునీటిలో ముంచుటమూలముగా చంపబడవలెను. తరువాత నవి కాల్చి వేయబడవలెను. విషముపెట్టిచంపు యెరవిషయములో ఆరోగ్యశాఖవారి సలహాప్రకారం జాగ్రత్తచేయవలెను. యిండ్లలోగాని పొలములోగాని యెలుకలను తరిమివేసి వాటికన్నములలోనికి బొరియలలోనికి కాలుచున్న పొగాకును, వేపమండలను, గంధకపు పొగను హెల్తుఆఫీసర్లు చెప్పినప్రకారం పొగను పోనిచ్చుటమూలముగా చంపవలెను.

## 3 మశూచకము

దీనినే వాడుకలో పొంగు, లేక పోలేరమ్మ లేక పెద్దమ్మవారు, ఆటలమ్మ అందురు.

1. వచ్చుటకు కారణము :

టీకాలు వేయించుకొనకపోవుటవల్ల కలుగుచున్నది. టీకాలు వేయించుకొనుటవల్ల ఈ వ్యాధి రాకుండా చేసికొనవచ్చును.

2. టీకాల యుత్పత్తి :

స్ఫోటకం తగిలిన మనుష్యుని శరీరమునుండి చీమును దీసి దానిని సుఖముగానున్న మరొకని శరీరములో చర్మము క్రిందికి దిగునట్లు పొడుచుట ఆచారమై యున్నది. గాని షుమారు 1798 సం॥ ప్రాంతమున డాక్టర్ ఎడ్వర్డ్ జన్నర్ అను గొప్ప ఆంగ్లవైద్యుడు గోవుల పొదుగుల

మీదను, చన్నులమీదను పొక్కినట్టి పొక్కులలోని చీమును దీసి మనుష్యుల చర్మములోనికి దింపినయెడల స్ఫోటక బాధ కలుగదను క్రొత్తహంశమును కనిపెట్టెను. దీనికి దోహదరస మని పేరు పెట్టిరి.

3. టీకాలువల్ల లాభములు :

1. మశూచకము రాకుండుట. 2. మశూచకము తగిలినను చావకుండుట, 3. వ్యాధితగిలిన ప్రతి ముగ్గురు మనుష్యులలోను సగటున షుమారు ఒకమనిషి చనిపోయే పద్ధతి మానుట, 4. చనిపోక బ్రతికియున్న వారున్నను జీవితపర్యంతం గ్రుడ్డివారో లేక అంగహీనులో అగునని లేకపోవుట.

4. టీకాలువేయు కాలము :

1. ఆరుమాసములలోపల టీకాలు వేయించగూడదు. 2. 6 మాసములు దాటినవారికి టీకాలు వేయించవలెను. బాల్యమునందు వేయబడిన టీకాలు 7 సం॥ ల వరకు కాలపరిమితి తగ్గకుండును. 3. ప్రతి 5 సం॥ లకు ప్రతివారు టీకాలు వేయించుకొనవలెను. 4. మశూచికం వున్న ఇంటిలోగాని, యింటికి చుట్టు 150 గజముల దూరములో కాపురంయున్న పిల్లలుగాని ఆరుమాసములోపు అయినను టీకాలు వేయించవలెను.

5. టీకాలు వేయబడినట్లు తెలుపు చిహ్నములు :

టీకాలు వేసినతరువాత రెండవ లేక మూడవ రోజున పొంగును. 5 వ రోజున పొంగిన స్థలము పెద్దదై కాపి

రంగును లేక ఎరుపురంగును కలిగియుండును. జ్వరముకూడా వచ్చును. 8 వరోజున రసికలిగిన బొబ్బ ఏర్పడును. రెండు రోజులు తరువాత కసి గట్టిపడును. పదునాల్గవ లేక పదునైదవరోజున ఎండిపోయి పక్కుగట్టును, యీ పక్కు వూడిపోయిన తరువాత దాదాపు గుండ్రముగా యుండునట్టియు కొంచెము పల్లముగా నుండునట్టియు ఆకృతిగల మచ్చ ఏర్పడును. ఇదియే టీకాలు వున్నట్లు నిరూపించును

6. టీకాల పుండ్లను మాన్పుటకు చేయుపద్ధతి :

చేతికి రెండు చో॥ షుమారు వెండి రెండణాల బిళ్ల యంత పెద్దదిగా నుండునట్లు నాలుగుమచ్చలు పొడిపించవలయును. టీకాలు వేయబడిన బిడ్డయొక్క చేతులకు ఆవుపేడ లేక యితర మందులుకట్టకుండా చేయుట శుభ్రముగానుండునట్లును, బొబ్బలను గోకకుండునట్లును జాగ్రత్తపుచ్చుకొనవలసినదనియు లేసియడల మానుటకు అలవిగాని కురుపులు లేవచ్చుననియు, బిడ్డకు జ్వరము వచ్చినప్పుడు కొంచెము ఆముదము యివ్వవలెననియు బిడ్డను ఎండలో నుంచకూడదనియు గ్రామాధికారి బిడ్డల తల్లిదండ్రులకు బోధించవలెను. హెల్తు ఆఫీసరులు యిచ్చునట్టి మందును టీకాలకు రాయునట్లు బోధించవలయును.

7. టీకాలువేసినను ఫలితమునకు రాకపోవుటకు కారణములు :

1. చెడిపోయిన లేక శక్తిలేని రశి. 2. టీకాలు వేయువాని అజాగ్రత్తతలేక అతడు టీకాలు చక్కగా పొడువక

పోవుట. 3. టీకాలు వేసిన భుజములను వెంటనే కడిగివేయుట. 4. వేసినటీకాలు పనిచేయకుండునట్టి దేహతత్వము కల్గియుండుట.

8. టీకాలవివరం :-

(1) ప్రైమరీ వ్యాక్సినేషన్ : ముందెప్పుడు టీకాలు పొడిపించుకొనకయు,మశూచకముతగులకయునుండు మనిషికి టీకాలు వేయుట. (మొదటిసారి టీకాలు వేయుట అనబడును.)

(2) సెకండరీ వ్యాక్సినేషన్ : మొదటిసారి వేసిన టీకాలు వ్యర్థమయ్యేయడల ఒకనెలకు తక్కువగాని కాలము అయిన వెనుక రెండవసారి టీకాలు వేసి పనిచేయుట. (రెండవ సారి టీకాలు వేయుట అనబడును.)

(3) టర్షరీ వ్యాక్సినేషన్ : రెండవసారి టీకాలు వృధయగునేని ఒకనెల అయ్యిన వెనుక మూడవసారి టీకాలు వేయుట

(4) రీవ్యాక్సినేషన్ : ముందుగా ఒకసారి మశూచకం పోసినమీదట టీకాలు వేయటము లేక టీకాలు కాలపరిమితి అయిన తరువాతను తిరిగివేయించుకొనుట అనునవి.

9. మశూచకము రిపోర్టుచేయనందుకు శిక్ష :-

ఏ యింట మశూచకము గలదో ఆయింటి యజమానిలేక ఆయింటి ఖామందు వచ్చి చెప్పవలెను,అట్లు చెప్పని యెడల గ్రామాధికారి రిపోర్టు చేసినమీదట లోకల్ బోర్డుల 1920 సం॥ నె 8 రు ఆక్టు 138 సెక్షన్ ప్రకారం రు 50 లకు

మించని జరిమానా మేజస్ట్రేటువల్ల పొందుటకు అర్హుడై యున్నాడు.

10. గ్రామాధికారియొక్క పనులు :

వ్యాక్సినేటరు గ్రామంలోనికి వచ్చినప్పుడుగాని, టీకాలు వేయవలశిన పిల్లలు ఎక్కువగా నున్నచో తహశ్శీల్దారు ద్వారా వ్యాక్సినేటరును గ్రామాధికారి పిలిపించుకొనగా వచ్చినప్పుడుగాని, ఒకచోట టీకాలు వేయవలశ్ని పిల్లలందరిని సమావేశపరచి టీకాలు రిజిస్టర్లు మొదలగునవి హాజరుపెట్టి టీకాలు వేయించవలెను. ఎవరైన టీకాలు వేయించుకొనక నిరాకరించినయెడల తక్షణమే సబ్ మేజస్ట్రేటుకు తెలియపరచవలెను, వ్యాక్సినేటరు వచ్చి చూచు తేదీకి పూర్వం గ్రామ హెడ్మన్ గ్రామంలో టముకు వేయుట మూలంగా అట్టి తేదీని ప్రకటించి, టీకాలు వేయబడతగిన శిశువుల జాబితానొకదాన్నిని గ్రామ చావడిలో అంటించవలెను. హెల్తు యినస్పెక్టరు వచ్చుటకు పూర్వం యిట్టి నోటీసు వొకటి యివ్వబడవలెను. జాబితాల స్పష్టపరుపబడిన శిశువుల సంరక్షకులు నియమిత స్థలమునకు తీసికొని వెళ్ళునట్లు చూచుట, గ్రామాధికారియొక్కయు, పంచాయితీబోర్డులు యేర్పాటుచేయబడిన గ్రామములో పంచాయితీబోర్డు ప్రెశిడెంట్లుయొక్కయు విధి అయివున్నది.

నోటీసు ప్రకారం శిశువును హాజరుపర్చని సంరక్షకునికి ఫలానా తేదీన హాజరుపెట్టమని క్రొత్త నోటీసు అమలు జరపవలెను. అప్పటికీ తీసుకు రానియడల లోకల్ బోర్డుల

ఆకు 137, 200 సెక్షన్ల క్రింద చర్య తీసుకొనుటకు మేజస్ట్రేటుకు రిపోర్టు చేయవలెను.

ఆరోగ్య ప్రచారమును తన గ్రామములో ఫలవంతముగా కొనసాగించుటకు పబ్లిక్ హెల్తు శిబ్బందికి గ్రామ హెడ్మన్ తగిన సహాయమంతా చేయవలెను.

# 4 జ్వరములు

ఇవి నాలుగు విధములు. 1. మలేరియా 2. యిన్ఫ్లూయింజా. 3. రిలాప్సింగుఫీవర్ 4. టైఫాయిడ్.

## 1. మలేరియా

దీనికి వాడుకలో 1.వరుసజ్వరం, 2. శీతకట్టు జ్వరం, 3. దోమజ్వరం. 4. మన్యజ్వరం 5. చలిజ్వరం అను పేర్లు గలవు. మన్యం అనగా అడవులనుంచి వ్యాపించుటచే మన్యజ్వరమనియు, దినమువిడిచి దినము క్రమము తప్పక వచ్చుటచే వరుస జ్వరమనియు, శీతాకాలములో వచ్చుటచే శీతకట్టు జ్వరమనియు పేర్లు. గాని చలియు, జ్వరము రోగ లక్షణము లగుటచే చలిజ్వరము అను సార్థక నామము పెట్టిరి.

(a) వచ్చుటకు కారణము :

1. మనుష్యుని రక్తములో సూక్ష్మమైన క్రిములు వుండుటచేతను 2. ఒకవిధమైన దోమ మనుష్యుని రక్తము

పీల్చినపుడు అది మన్యజ్వర సంబంధమైన క్రిమిని లోపలికి ప్రవేశపెట్టుట చేతను కలుగుచున్నది.

(b) రాకుండాచేయుటకు మార్గములు :

1. జీవించియున్న రోగి రక్తములోని రోగక్రిమిని చంపుట 2. ఆరోగక్రిమిని తీసుకొని రాగలిగిన దోమలను చంపుట.

(c) చి కి త్స :

మొదటదాన్కి క్వయినా మందు వాడవలెను. రోగికి జ్వరం కొంచెం దిగజారి చెమ్మటలు క్రమ్మిన తర్వాతను, కొంచెం ఆహారం తినిన తర్వాతను మొదటి మోతాదు పుచ్చుకున్న 6 ఘంటలకు రెండవ మోతాదు యివ్వవలెను. జ్వరము లేకపోయినను కొన్నాళ్లువరకు యియ్యవలెను. వారంరోజులకు మించి యింకా జ్వరం వచ్చుచున్న యెడల మన్య జ్వరం కాదని తెలుసుకోవలెను.

(d) చలిజ్వరము అనుమానముగా నున్నప్పుడు చేయు చికిత్స :

రోగికి అన్నముపెట్టక పాలు, జావ యివ్వవలయును. 2. జ్వరమును ప్రతి నాలుగు గంటలకు కొల్వవలయును. 3. నెత్తురను పరీక్షించవలెను. 4. జ్వరము అధికముగా నున్న తగ్గించు మందు యివ్వవలెను. 5. సాఫీఅగు విరేచనము చమట పుట్టించు మందు యివ్వవలెను. 6. చలి జ్వరమని తెలుసుకొన్నప్పుడే క్వయినా వాడవలెను.

(e) క్వయినా యుత్పత్తి :

చింకోనా అను నామె 1640 సం॥ (సింకోనాచెట్టు యొక్క చేదుగానుండే తోలు) క్వయినామందును కనిపెట్టి జ్వరములకు ప్రసిద్ధిగా యుపయోగించుచుండెను. గాని 1880 వ సం॥ లో లెవరన్ అను ఫ్రెంచి వైద్యుడు వ్యాధి గల రోగులయొక్క నెత్తుటిలో ఒక పురుగు వుండుననియు, ఆ పురుగు కదులుచూ, కొన్ని మార్పులు చెందుటచే చలి జ్వరము వచ్చుటకు కారణమనియు, మొట్టమొదట కని పెట్టెను. క్వయినామందు ప్రతి పోస్టాఫీసులోను, గ్రామో ద్యోగస్థుల వద్దను, స్కూలు మాస్టర్ల వద్దను దొరకును

(f) క్వయినా ఉపయోగించు విధము :

ఒక బిళ్ల 5 గ్రెయినుల చొప్పున 20 బిళ్లలు లభించును. జ్వరమున్నప్పుడు ప్రతి మూడు గంటలకు వకే పర్యాయము ఒకబిళ్లయు, అటుతర్వాత బిళ్లలు అయిపొవు వరకు రోజునకు ఒకటి చొప్పున ప్రతి సాయంకాలము పుచ్చుకోవలెను. 5 సం॥ లోపల బిడ్డలకు జ్వరమున్నంత వరకు రోజుకు ఒక బిళ్ల చొ॥ దానిని రెండుభాగములుగా జేసి ఉదయమొక భాగము సాయంకాల మొకభాగము, పిమ్మట 10 రోజులువరకు రోజుకు వకపూట వక బిళ్ల చొ॥ రోజువిడిచి రోజు యివ్వవలయును. 5 సం॥ మించి 14 సం॥ లోపు వయస్సుగల బిడ్డలకు జ్వర ముండునంతవరకు పూట వకటింటికి ఒక బిళ్ల చొ॥ రోజుకు రెండు పూటలున్నూ అటు తర్వాత 14 రోజులవరకు రెండురోజుల కొక బిళ్ల చొ॥

యున్నా వాడవలెను. 4 వడ్లగింజల యెత్తుగల బిళ్ళ 1 చొ॥ 20 బిళ్లలు పూర్ణారోగ్యము పొందుటకు వాడవలెను. క్వాయినా నీళ్లతోగాని పాలతోగాని పుచ్చుకోవలెను. విరేచనము కావలసియున్న యెడల 3 ఔన్సులు సునాముఖికషాయములో మాగ్నీషియం లవణము వక చెంచాడుకరగించి మాత్రల యొక్క మొదటి మోతాదుతో పుచ్చుకోవలెను. చలిజ్వరము లేకపోయినను 1. మన్యదేశములో నివసించువారికి 2. యిదివరలో మన్యజ్వరం తగిలినవారికి వారముకు రెండుసార్లు భోజనమైనపిమ్మట పులుసుకలిపిన నీళ్లలో 10 గ్రెయినుల ఎత్తు మోతాదు యివ్వవలెను.

(g) దోమల వివరం :-

ఇవి రెండువిధములు. 1 అనాఫలీసుదోమ 2 క్యూ్యాపెక్సు దోమ. యివిగాక స్టిగోవియా దోమ మొదలగునవి కొన్నిరకముల దోమలు గలవు. స్టిగోవియాదోమ చెవుదగ్గరజేరి గెంయ్‌మని కూయును. గాని అపకారముచేయదు, యిదియించుమించుగా క్యూ్యాపెక్సుదోమవలె నుండును. యిది పగలురాత్రియనక సర్వదా మేయుచుండును. వీనినే పులిదోమలు అనికూడా అందురు.

(h) క్యూ్యాపెక్సుదోమ :-

యిది గూనివానివలె గోడమీాద వ్రాలియుండును. యిది కుట్టిన యేనుగకాలు, బోదకాలు బుడ్డ మొదలగు వ్యాధులు వచ్చును.

(i) అనాఫలీసు దోమ :-

యిదియే యెక్కువ అపకారము చేయును. యివి మానవుని నుండి మరియొకనికి మలేరియా జ్వరమును వ్యాపింపజేయును. వీటిలో ఆడవి, మగవి అను రెండురకములున్నవి. ఆడవి మానవునిరక్తము త్రాగి బ్రతుకును. యివి సిపాయివలె నిటారుగానుండి రాత్రులయందు సంచారముచేయును. చలికాలము రాగానే యెక్కడ వేడిగానుండునో అక్కడికిపోయి తగుకాలము వచ్చినప్పుడు చేరును.

(j) దోమలను చంపుట :-

(1) దోమలు తమ గ్రుడ్లను నీటిమీాదపెట్టగా అవి రెండుమూడు దినములలో పెరిగి పురుగులవలె తేలును. యీా విధముగా రెండువారములలో వేలకొలది పిల్లలు తయారగును. పక్షులు, చేపలు, పురుగులు, గబ్బిలములు, చీమలు, వీటికి విరోధులు. దోమపిల్లలనే దోమలు తినును ఉప్పు, సున్నము, మైలతుత్తము, అన్నభేది మొదలగువాటి వల్ల వీటిని చంపవచ్చును. అవి ఖరీదుగన్క చవక బారు కిరసనాయిలును, కార్బాలిక్ యాసిడ్‌లో కలిపి చల్లవలెను. కాపురం యిండ్లలో వెల్తురురానిచో చీకటిమూలలందు నివశించును. గాలి వెలుతురు రానిచ్చి సున్నం కొట్టించిన దోమ కాటునుంచి బాధ తొలగును.

(2) దోమలు నీటిలో గ్రుడ్లను పెట్టును. గాన గ్రామమునకు నాలుగువందల గజముల దూరములో, లేక చుట్టూ అర మైలు దూరములోపలలోనూ వున్న నిల్వనీటి గుంటల నన్ని

టిని తొలగింపవలెను. పీలులేనిచో పారిస్ గ్రీన్ అను మందు ఒక భాగమును నూరుభాగముల సన్నని రోడ్డుదుమ్ముతో దామాషా ప్రకారం కలిపి సదరు దుమ్మును గుంటలమీద చల్లవలెను. పానోదకమునకు ప. కివచ్చు నీటిలో దోమనీటి మట్టమున నుండువాటిని తిను నెత్తళ్ల చేపలను (టాపీఫీడింగు చేప) అగ్రికల్చరల్ డిపార్టుమెంటువారి వద్దనుంచి తెప్పించి చెరువులలోను, బావులలోను వేయించవలెను.

(k) రాకుండుటకు ముందు జాగ్రత్తలు :

1. శరీరమునకు చలి సోకకుండా నుంచుకోవలయును. 2. నేలమీద యెన్నటికీ పరుండవద్దు. 3. పొడి నేలమీదనే యింటిని యేర్పరచుకొనుము. 4. దోమతెర లోపల నిద్రించుము. 5. పారుదల పొలములగుండా ప్రవహించు నీటిని త్రాగగూడదు. 6. దోమలను నాశనము చేయువలెను. 7. నీళ్ళను కాచి త్రాగవలెను 8. క్వయినా మందు వాడవలయును. (చింతపండు పులుసుతోగాని, నిమ్మకాయ రసముతోగాని)

## 2. ఇన్ ఫ్లూయింజా

దీనినే విషపడిశ మందురు. ఇది రెండువిధములు. 1. ప్రథమములో నెమ్మదిగా నుండి, పిదప తీవ్రమగుట. 2. ప్రథమములోనే తీవ్రమగుట.

(a) రోగలక్షణములు :

ప్రథమములో నెమ్మదిగా వచ్చు జ్వరమునకు అపరిమితమగు తలనొప్పి, వణుకు, కండ్లు యెఱ్ఱబడి నీరుకారుట,

తుమ్ములు, మొదలగునవి నెమ్మదిగా ప్రారంభించుటచే యేవ్యాధి అయినది తెలుసుకొనలేక అశ్రద్ధ చేయుటవలన తీవ్రమైన వ్యాధిలోనికి దించును.

ప్రథమములోనె తీవ్రముగా వచ్చు రోగము పై లక్షణములతో ప్రారంభించి, ఊపిరితిత్తులు, జీర్ణకోశము చెడిపోయి కండ్లు పసరులుకమ్మి, క్షయసంబంధమయిన దగ్గు యేర్పడి మనిషి చనిపోవుటయు గలుగును. యిన్ఫ్లూయింజా రోగులకు పక్షవాతం, బలహీనత, చిత్తచాంచల్యము కలుగజేయును.

(b) వచ్చుటకు కారణము :—

ఒక చిన్న క్రిమిసోకుడు తగిలిన మనిషియొక్క కళ్లలోను, ముక్కుయొక్కయు, నోటియొక్కయు, గొంతుయొక్కయు ద్రవములోనుండి సదరు వ్యాధివలన బాధపడు మనుష్యులు దగ్గుటవలనను, వుమియుటవలనను చీదుటవలనను గాలిలోకలసి చిన్నబిందువులు చాలాకాలము వరకు తేలియాడుచు చుట్టుప్రక్కల నున్న ఆరోగ్యవంతులయిన మనుష్యులకు సోకుడు కలిగించును.

(c) రోగికి చికిత్స .-

1. వెలుతురు, గాలి, ధారాళముగా వచ్చు గదులలో రోగిని వుంచుట, లేదా ఆరుబయట వుంచుట, 2. ఎల్లపుడు ఎత్తయిన మంచముమీద పరుండబెట్టి వుంచుట. 3. ధరించు బట్టలను సబ్బునీళ్ళలో కడిగివాడుట. 4. కొంత మట్టిచే నింపబడిన చిప్పలలోని మలమూత్రాదులను దూరంగా

పార వేయుట. 5. వుప్పునీళ్ళతో ముక్కునుకడుగుట(సొల్యూషన్ చేయుట)

(d) సొల్యూషన్ చేయుటకు, వుపయోగించుటకు విధములు :

1. ఒక పైంటు వేడినీళ్ళలో ఒక చిన్న చెంచా వుప్పు కలుపవలెను. (పయింటు అనగా 20 అవున్సులు) ఈనీటిలో కొంతభాగము నోటిని పుక్కిలించవలెను. 2. మిగిలిన కొంత భాగము అరచేతిలోనికి తీసుకొని అంగిటికి తగులునంతవరకు ముక్కురంధ్రములద్వారా యీద్రవమును కొంతవరకు నెమ్మదిగా పీల్చవలెను. ద్రవమును వుమ్మివేయవలెను. యిట్లే 2, 3 పర్యాయములు చేయుచూ యుండవలెను, యీ క్రమము నకే రోజుకు నాలుగైదు పర్యాయములు చేయవలెను.

(e) వ్యాధి రాకుండుటకు ముందు జాగ్రత్తలు :

1. సోమరితనము లేక ప్రతిదినము పరిశ్రమ చేయుట 2. అలసటచెందు అధికపనులు చేయకుండుట. 3. చలిగాలి విశేషముగా దేహమునకు తగలనీయకుండుట. 4. చలికాలములో ఉష్ణమునిచ్చు వస్త్రములను ధరించుట. 5. పరిశుభ్రమైన ఆహారమును తినుట. 6 మితముతప్పి భుజించకుండుట. 7. జనసమ్మర్దము గలుగు మీాటింగులు, సినీమాలకు వెళ్ళకుండుట.

## 3. రిలాప్సింగ్ ఫీవర్

దీనికే 1. తామజ్వరమనియు, 2. మరల మరల వచ్చు జ్వరమనియు 3. పేలజ్వరమనియు, 4. పరక్ఛాల్ లేక మొండిజ్వరమనియు పేర్లు.

(a) వ్యాధివచ్చు మార్గములు :

రెక్కలులేని విషపురుగులు, శరీరముమీద ప్రాలి కరచుటచేత వచ్చును. అనగా పేను కాటువలన కూడా కలుగును. యీ వ్యాధి 15 మొదలు 35 సం॥ లు వయస్సు లోపల నుండువారికే వచ్చుచుండును.

(b) వ్యాధి లక్షణములు :

1. అతివేడిమీద ప్రారంభించి తీవ్రమైన తలనొప్పి వీపునందు నొప్పి, పొత్తికడుపులోను, అవయవములోను, అమిత నొప్పి, కామెరలు, 6–7 రోజులవరకు జ్వరము హెచ్చుగానుండి, పిమ్మట వకేసారి సమశీతోష్ణమునకు వచ్చుట, 2. జ్వరము తగ్గునపుడు విస్తారముగా చెమటపట్టి దారుణమైన అతిసారము కలుగుట, 3. అమిత బలహీన ముగా నుండుట, 4. జ్వరము పోయిన తర్వాత రోగి మిక్కిలి బలహీనముగా యుండి ఒక వారం తరువాత ఒకే సారి యుద్రేకముగా యుష్ణముకలిగి నాల్గురోజులు మాత్రమే వుండి, నెమ్మదించి, మరల వచ్చి, చనిపోవుట కలదు.

(c) చికిత్స :

1. పాలు, జావ, బలమిచ్చు మందులు యిచ్చుచుం డవలెను. 2. పేలను చంపించివేయవలెను. (చలికాలములో విస్తారము పేలు వుండుటచేతను మరలమరల జ్వరము వచ్చును. వేసవికాలమున అంతగా పేలుండవు.) 3. తల వెంట్రుకలను కత్తిరించుకొనవలెను. అవకాశము లేనివారలు

కిరసనాయిలుతో అప్పుడప్పుడు తల మర్ధించుకొని స్నానము చేయవలెను. 4. శరీరమును, వస్త్రములను నీటిలో శుభ్ర పర్చవలెను. 5. యింటి గోడకు సున్నము కొట్టించవలెను.

(d) మొండిజ్వరం రాకుండా ముందు జాగ్రత్తలు :

1. నిత్యం, 1, 2 సార్లు స్నానము చేయవలెను. 2. కట్టువస్త్రములునిత్యం వుతికినవి ధరించవలెను. 3. పక్క గుడ్డలు వేడినీళ్ళతో తడిపి ఆర వేసినవి ఉపయోగించవలెను. 4. ప్రతినిత్యం యిండ్లు శుభ్రపర్చుకొనుచూ అప్పుడప్పుడు గోడలను సున్నం కొట్టించవలెను.

## 4. టైఫాయిడ్

(a) లక్షణములు

ఇది విషజ్వరమని, సన్నిపాతజ్వరమనికూడా పిలువ బడును. ఇదిఒక అంటువ్యాధి. 2 లేక 3 వారముల పరిమాణ కాలానంతరం యీ జ్వరం ప్రారంభించును. శీతోష్ణస్థితి (Temparature) క్రమేణ మొదటివారములో ప్రారంభించి వారాంతముకు 104°, 105° వరకు రావచ్చును. రెండవవార ములో జ్వరమునిలబడి, మూడవవారాంతముకు క్రమేణ దిగ జారి యథాస్థితికివచ్చును. ఈ రోగములో జ్వరముతో పోల్చిచూచిన నాడి కొంచెము నెంపాదిగానడచును. అంత్ర ములు (Intestines) కృత్రిమమైనప్పుడు నీళ్ళ విరేచనములు కూడ అగును. 8 లేక 9 వ రోజున పొత్తికడుపుకు పైభాగ మున నరములవత్తిడి అగపడవచ్చును.

(b) ముందుజాగ్రత్తలు, చికిత్స :

ఈవ్యాధి వ్యాపించకుండా నిరోధించుటకు రోగిని ప్రత్యేకంగా యుంచవలెను. సోకడు తగిలినవారందరికిన్ని T. A. B. వాక్సైనుతో ఇనాక్యులేటు చేయించవలెను. రోగి యొక్క మలమూత్రాదులు శుద్ధి (Disinfect) చేసి సరిగా తీసి పారవేయవలెను. రోగిదుస్తులు శుద్ధిచేయనిదే ఏ జలాశయములోను, ఉతుకరాదు. విషజ్వరపురోగుల మలంమీద ఈగలువ్రాలి ఈవ్యాధికి కారణంగల సూక్ష్మజీవులతో ఆహారమును అపరిశుభ్రము చేయును. విషజ్వరపు జాడ్యములలో ముఖ్యముగా పాలు అపరిశుభ్రతనుంచి ప్రత్యేకంగా సంరక్షింప బడవలెను. విషజ్వరం మనుష్య వాహానములనుండి గూడ వ్యాపించవచ్చును. అట్టివాహానములు సాధ్యమైనంత వరకు ఎచ్చటవీలైతే అచ్చట విడిచిపెట్టవలెను. మంచినీటి బావులన్నియు అప్పుడప్పుడు క్లోరినేట్ చేయుచుండవలెను.

## 5. క్షయం (Tubercu'losis)

(a) ల క్ష ణ ము లు :

ఈ వ్యాధి ప్రారంభంలో సులభంగా కనిపెట్టబడక క్రమాభివృద్ధి పొందును. క్షయఅనే మాట సామాన్యంగా వాడుకపడం అయినది. ఊపిరితిత్తులు చెడినయెడల ఉబ్బస మందురు. అది ఏమనుష్య కండరముకైనను లేక ఎముకకైనను అంటవచ్చును. ఉబ్బసపు రోగులు, క్షయ సూక్ష్మజీవులతో నిండిన, తమ ఉమ్మితో తాకినవారికి సోకుడు

కలుగజేయుదురు. తర్వాత బిడ్డలు తమతల్లులు ద్వారా యీ వ్యాధి సంపాదించుకొందురు.

క్షయరోగి బలహీనం పొందుతూ పొందుతూ క్రమేణ తూకం తగ్గును. అతను ఏపని చేయుటకు ఇష్టపడడు. తేలికగా అలసట చెందును. రాత్రిళ్ళు చెమ్మరించును. సాయం సమయములో శీతోష్ణము కొలదిగా హెచ్చుచూ వృద్ధి పొంది ఆకలిక్షీణించును. మొదట్లో కళ్లె లేకుండాను, తదుపరి కళ్ళెతోను, రాత్రిళ్లు కొంచెము పాడిదగ్గు వచ్చును. మంచంమీాద పూర్తిగా శయనగ్రస్తుడైన తరుతాత కొన్ని సమయములందు నెత్తురుగూడ ఉమియుచుండుట గోచరించును.

(b) ముందు జాగ్రత్త, చికిత్స :

ఈ వ్యాధిని నిరోధించుటకు ఎక్కువ గుంపు గూడుట మానవలెను. గాలి, వెలుతురులయొక్క స్వేచ్ఛా ప్రసారం, ఈ వ్యాధి వ్యాప్తియొక్క నిరోధములోను, చికిత్సలోను, ముఖ్యాంశములు. బిడ్డలను క్రమేణ పరీక్షించి, అనుమానాస్పదమైన కేసులున్నయడల ముందుగానే చికిత్స చేయవలెను. క్షయవ్యాధిగల తల్లిని ఆమె బిడ్డలనుండి వేరుపర్చవలెను. రోగి కళ్లె ఎల్లప్పుడును లోపను వేయబడిన ఒక పీకితానులో చేర్చబడిన తర్వాత తగులబెట్టవలెను. పీకితానులలో మాత్రమే ఉమియవలసియున్నదిగా రోగికి ఘట్టిగా చెప్పవలెను. క్షయరోగం గల ఆవుల పాలు మానవలెను. కాబట్టి పాలు ఉపయోగించుటకు పూర్వం బాగా కాచ

వలెను. ఎక్కువ గుంపుగూడుటవల్ల వచ్చు ప్రమాదములు, ఆరోగ్యకరమైన మంచి ఆహారముయొక్క ఆవశ్యకత, మంచి అలవాట్లు, పరిశుభ్రమైన గాలిని గురించి ప్రజలకు గ్రామాధి కారి బోధించవలెను.

## 6. కుష్టు (Leprosy)

లక్షణములు :

ఇది చిరకాలమునుండి వున్న అసహ్యాకరమైన ఒక వ్యాధి. ఈవ్యాధి, కొన్ని అవస్థలలో ఘోరమైన అంటువ్యాధిగా పరిణమించును. ఈవ్యాధి పరిణామకాలమువలెనే సోకుడుయొక్క యదార్థవిధానము బాగా తెలియదు. ఇది దీర్ఘకాలపు సన్నిహితస్పర్శవలననే వ్యాపించునని నమ్మబడవచ్చును. ఈ వ్యాధి సామాన్యంగా అందరు అనుకుంటున్నట్లే వంశపరంపరగా వచ్చునదిగాదు. కుటుంబంలోని సన్నిహితస్పర్శ సంబంధీకులకు అందరికీ వచ్చునదిగా ఎంచవలెను.

ముందుజాగ్రత్త, చికిత్స :

ఈవ్యాధివ్యాప్తిని నిరోధించుటకు కుష్టురోగుల ఏకాంతవాసము, చికిత్సావిధానము, చాలాముఖ్యం. ఒక ప్రదేశంలోనున్న రోగగ్రస్థులను లెక్కించుట వాస్తవంగా చాలా కష్టమైన పని. ఎందువలన అనగా చాలామంది పైకి చూచుటకు బాగుగనేకన్పింతురు, గాని వారు అధికమైనసోకుడు గలవారుగా నుండవచ్చును.

చిన్నబిడ్డలను, స్కూలువిద్యార్థులను అప్పుడప్పుడు వైద్యపరీక్షచేయించిన చికిత్సకు, ఏకాంతవాసమునకు తగిన

పోర్లను వెంటనే ఎంచవచ్చును. రోగియొక్క రోగవ్యాప్తి బాహ్యమునకే అగుపడుచున్నవారలను 6 నెలల కొకతూరి పరీక్షించిన చాలును. ఈవ్యాధియొక్క తరుణావస్థలో దీర్ఘ కాల చికిత్స మంచిఫలితము లిచ్చును.

## 7. ఫైలేరియా (Filaria)

బోదకాలు చేతులు, విపరీతముగా లావుబారివుండును 'క్యూలెక్సు' దోమ కుట్టినవచ్చును.

## 8. రాకాశి తామర

మనుష్యులకు వచ్చు అంటువ్యాధుల్లో ఇదొక మొండి తామర ఈజాతి తామరకల్గినవారు అపరిమితమైన దురదతో బాధపడుచుందురు.

## 9. పుష్కరములు

పుష్కరము అనగా 12 సం॥రముల కొకసారి నదీప్ర దేశమునందు, చనిపోయినవారి వర్గత్రయంతో పిండప్రదా నాది తర్పణాలు విడుచుటకై చేయుకర్మ. ఈ సందర్భ ములో వేలకొలది జనులు సమకూడుదురు. అందువలన స్నానముచేయు చోట, బహిర్దేశమునకు పోవు చోట నీరుకల్మషమై కలరా మొదలగు అంటువ్యాధులు సంభ వించును. అందుకుగాను ముందుగా యాత్రార్థమైవచ్చు వారికి కలరా యిన్‌జక్షను యిప్పించవలెను. ఉత్సవములు మొద లగుచోట అంటువ్యాధులు ప్రబలకుండుటకు ఆరోగ్యశాఖ వారిచే తగిన యేర్పాట్లు చేయబడును.

## 10 రక్తవిరేచనములు, అజీర్ణవిరేచనములు

(a) వచ్చుటకు కారణములు :

1. రాత్రిళ్లు బయటపరుండుటచే చలిగాలి కడుపుకు తగులనిచ్చుటచేతను. 2 ఆహారమునందలి లోపముచేతను అనగా చెడుచున్న పాలు కాయగూరలు, మాంసము భుజించుటచేతను. 3 మురికినీరు త్రాగుటచేతను 4 మలము, పేడ, దుర్గంధము కలుగజేయు వస్తువులు యింటికి చేరువనుండనిచ్చుటచేతను 5 కాళ్లకు దుమ్ము అంటుకుని తద్వారా వచ్చు ఈగలను ఆహార పానీయములకు చేరనిచ్చుటచేతను కలుగుచున్నవి.

(b) రాకుండాచేయు మార్గములు :

1. యింటిస్థలము శుభ్రముగానుంచుట. 2. ఆహార పానీయములపై మూతలుపెట్టియుంచుట 3. కాచిననీటిని త్రాగుట.

(c) చికిత్స :

రోగిని డాక్టరు పరీక్షించువరకు పాలుమాత్రం యివ్వవలెను. యితరమందులు వాడకూడదు.

## 11 పురుగులు.

ఇవి మూడువిధములు. 1. గుండ్రనిపురుగులు 2. నారి పురుగులు 3. కొక్కిపురుగులు.

1. గుండ్రని పురుగులు :

వీటినే నులిపురుగులు అనికూడ అందురు.

(a) వచ్చు మార్గము :

1. సోకుడుగల మనుష్యులు చెరువులలో స్నానము చేయుటవలన 2. బట్టలు వుతుకుటవలన 3. వర్షంవల్ల కొట్టుకొనివచ్చిన మలముకలసిన నీటిని త్రాగుటవలన ప్రేగులలో పురుగులు కలుగుచున్నవి.

(b) చికిత్స

కాచిననీటిని త్రాగవలెను.

(c) ముందు జాగ్రత్త

ఈగలుకూడ మురుగుడుతిను అలవాటుచొప్పున ఈ పురుగులయొక్క గుడ్లచే ఆహారమును మలినపర్చును. అందువలన ఆహారము దుమ్మునుండియు, ఈగలనుండియు అశుభ్రమగు మనుష్యులనుండియు జాగ్రత్తగా రక్షింపబడవలయును.

2. నారిపురుగులు – (a) వచ్చుమార్గము :

ఇవి చెరువులలోను బావులలోను ముఖ్యముగా దిగుడు బావులలోను నివసించి నీటిని త్రాగువారికి 'నారి కురుపులు' అనువ్యాధివచ్చును.

(b) చికిత్స :

రెండు లేదా అంతకుమించిన పొరలు వేయుబడిన మల్లు గుడ్డతో నీటిని వడియకట్టిన యెడల నారిపురుగును సోకుడు వ్యాధి పూర్తిగా తొలగించును. యీ గుడ్డ వడియకట్టుటకు పూర్వం ప్రతిసారియు వుతికి ఎండలో ఆరబెట్ట వలయును.

(c) ముందుజాగ్రత్తలు :

1. వ్యాధికి కారణముగా కనిపించిన నీటిని త్రాగకూడదు. యిట్టి జలాధారమును మూసి వేయించవలెను లేదా తోడిపారవేయించవలెను. 2. రోగులను చెరువులోనికి దిగనీయగూడదు. 3. మంచినీళ్ళను సలసల కాచి, వడియ బోసి, చల్లార్చి త్రాగవలెను.

3. కొంకిపురుగులు - (a) ఉత్పత్తి :

నోటియందు కొంకివంటి పండ్లు యుండుటవలన దీనికి యీపేరు కలిగినది. వీటిలో ఆడపురుగులు ½ అంగుళము పొడవుగలిగి మనిషి ప్రేగులలో నివసించుచు రోజుకు 1000 నుండి 2000 వరకు గ్రుడ్లను పెట్టును. ఈగ్రుడ్లు మలము ద్వారా బయటికివచ్చి మలము భూమిమీద నున్నపుడు ఈ చిన్నపురుగులు 12 నుండి 60 గంటల్లో పిల్లలగును. పిమ్మట మనుష్యుని శరీరములో ప్రవేశించుటకు కొన్ని నెలలవరకు వేచియుండును.

(b) వ్యాధివచ్చుమార్గము :

పాదములద్వారా మనుష్యుని శరీరములో ప్రవేశించును. పాదములు దురదగా నుండును. శరీరములో ప్రవేశించి 6 వారములలో పెద్దది అగును. భూమిమీద చావకుండగనే ఎట్లో మనుష్యుని శరీరములోనే చచ్చును.

(c) వ్యాధిలక్షణములు :

1. అజీర్ణము 2. అన్నహితవు లేకుండుట. 3. బలహీనత. 4. బుద్ధిమాంద్యము. 5. రక్తక్షయము. 6. పెదవులు,

నాలుక వెలవెలగా నుండుట. 7. మీాగాళ్లు వుబ్బుట. 8. ఆయాసము.

(d) ముందు జాగ్రత్తలు :

1 రోగులు వదలిన విరేచనము యున్నచోట త్రొక్క కుండుట. అవసరమైతే చెప్పులు తొడుగుకొనుట 2. గుడి శలచుట్టు యిండ్ల చుట్టు ఎక్కడపడితే అక్కడ మలవిసర్జనము చేయకుండుట. 3. హెల్తు ఆఫీసర్ల సలహాపైని పాయఖానాలు ఏర్పరచుకొనుట 4. పిల్లలయొక్క సుఖస్థితిని తెలుసుకొనుటకు అవకాశము కలిగినటువంటి స్కూలు మాస్టర్లు కూడ ఈ వ్యాధి నివారణోపాయము కొరకు శ్రద్ధ వహించుట.

చికిత్స :

పురుగులను చంపు విరేచనముల మందు డాక్టరు సలహాపైన పుచ్చుకోవలయును.

## 3 వ అధ్యాయము

# విషపు కాట్లు

## 1. పాముకాటు

పాముకాటు : చికిత్స

1. చేతిమీదగాని, భుజముమీదగాని, పాదముమీద గాని లేక కాలిమీదగాని విషపుపాము కరచినయడల కాటునకు పైగా లావు త్రాడుగాని గుడ్డనుగాని కట్టుము. సాధ్యమైనయడల కరచిన తావున నోరుపెట్టి దానిని చక్కగా పీల్చి వుమ్మివేయుము. (నోటిలో పుండ్లు వున్నయడల ఈ పని చేయకూడదు) పిమ్మట నోటిలో నీళ్లుపోసుకొని పుక్కిలించివేయుము. 20 లేక 30 నిమషములకు గుడ్డను తీసివేయుము. 2. పదునైన కత్తితో కాటుమీద చర్మం కోసి బాగా నెత్తురు కారనిచ్చి ఎర్రగా కాలిన యినుముగాని, బొగ్గుగాని దానిపై చుట్టునూ వుండిన చర్మమును కాల్చుము. 3. తలమీదగాని, మెడమీదగాని లేక (కాళ్లు చేతులు గాక తక్కిన) శరీరముమీద కాటున్నయెడల నోటితో పీల్చి కోసి కాలిన బొగ్గును దానిపైన పెట్టుము. కోయుటలో కోరలు ఎతవరకు దిగునో అంతవరకు కోయుము. బలహీనముగా నున్న, వేడిపాలు గాని, కాఫీగాని అరకోసారాయిగాని యివ్వవలెను.

## 2. తేలు కుట్టుట

చికిత్స :

తేలుకుట్టునప్పుడు అది చర్మములో చిన్న రంధ్రము చేయును. కుట్టినస్థలమునకుపైగా లావు త్రాడునుగాని గుడ్డను గాని కట్టి నెత్తురుకారునట్లు ఆస్థలమునందలి చర్మమునుకోసి మిక్కిలి దగ్గరగానుండు ఆస్పత్రిలో అందునుగురించి అడిగి తెలుసుకొనవలెను. 10 నిమిషములలో ఆగుడ్డనుగాని, త్రాటి నిగాని తీసివేయవలెను. పాముకాటువలె తేలుకుట్టు ప్రాణాంతకము కావటము అరుదు.

## 3. పిచ్చిజంతువు

(a) వ్యాధి వచ్చు మార్గము

పిచ్చిదని తలచబడినకుక్క, నక్క, తోడేలు (1) కరవటంవల్లగాని (2) గీరటంవల్లగాని (3) చొంగ తగులుటవల్ల గాని వచ్చును.

(b) పిచ్చిజంతువు లక్షణములు :

ఎప్పుడూ అరచుట, బలహీనమై కోపముతో విచ్చల విడిగా భయములేకుండా తిరుగుట, కనిపించిన జంతువును మనిషిని కరచుట మొదలగునవి. దీనిచే కరవబడిన మనిషికి కూడా యితరులను కరవడం, పిచ్చికేకలు, వెర్రిచూపులు మొదలగునవి ఏర్పడును.

(c) పరిణామకాలము :

అనగా వ్యాధి బయటికి తేలుటకు పట్టేకాలము. పిచ్చి జంతువు మనుష్యునిగాని వేరొక జంతువునుగాని కరచిన 6 నుండి 8 వారములలో వ్యాధిలక్షణములు బయటికి తేలును. అరుదుగా రెండువారములలో తేలవచ్చును. ఒకప్పుడు సంవత్సరముకూడా పట్టును.

(d) ప్రథమ చికిత్స :

1. పాముకాటుచికిత్సయే దీనికి చేయవలెను. నోటి యందు పుండ్లులేనివారు మాత్రమే నోటితో పీల్చి పుక్కిలించి వేయవలెను. 2. ఎక్కడ చికిత్సపొందుటకు అనుకూలమో అచ్చట రోగులను పిచ్చి ఆస్పత్రికి పంపవలెను. 3. పిచ్చి జంతువను అనుమానమున్నచో కట్టియుంచి పిచ్చిలక్షణములు కనిపించినచో చంపించవలెను. కరచినకుక్క పిచ్చిదని అనుమాన మున్నను, లేకపోయినను అదికరచిన తర్వాత సాధ్యమైనంత త్వరలో గాయమును బాగుగా కడిగి యెండనిచ్చి తర్వాత పూర్తిగా కాల్చవలెను. దీనికి స్వచ్ఛమైన కార్బాలిక్ ఆశిడ్‌ను వాడినచో గాయములోనికి బాగుగా ప్రవేశించి విషపదార్థములను శీఘ్రముగా తొలగించును. కాటువడిన తర్వాత ఎంత శీఘ్రముగా కాల్చిన అంతమంచిది. చికిత్సపొందుటకు నిశ్చయం చేసుకున్న తర్వాత అతి సమీపముననుండు చికిత్సాలయమునకు కాలహరణ చేయకుండా వెళ్ళవలెను.

(౯) చికిత్సాలయములు :

కూనూరు పాశ్చరు ఇన్‌స్టిట్యూటునందే గాక చెన్న రాజధానియందు ప్రతి హెడ్‌క్వార్టర్సునందుండు హాస్పిటలులోను, మదరాసు జనరల్ ఆస్పత్రిలోను (ఉదకమండలములోని ఆస్పత్రిమినహా) లావెడేల్‌లోనున్న లారెన్సు మెమోరియల్ రాయల్ మిలిటరీస్కూలులోను, యీ దిగువ ఆంధ్ర దేశములోని ఆస్పత్రులలోను చికిత్స పొందవచ్చును.

| జిల్లా పేరు | ఆస్పత్రివుండు స్థానము. |
|---|---|
| 1. కృష్ణాజిల్లా | బెజవాడ, నందిగామ, నూజివీడు, గన్నవరం. |
| 2. గుంటూరుజిల్లా | ఒంగోలు, నర్సరావుపేట తెనాలి,వినుకొండ, రేపల్లె. |
| 3. పశ్చిమగోదావరి జిల్లా | భీమవరం, చింతలపూడి. |
| 4. తూర్పుగోదావరిజిల్లా | అమలాపురం, పిఠాపురం, పోలవరంఏజన్సీ, భద్రాచలం. |
| 5. విశాఖపట్నంజిల్లా | పార్వతీపురం,నరసీపట్నంఏజన్సీ కోరాట్. |
| 6. బళ్లారి జిల్లా | హాస్‌పేట. |
| 7. చిత్తూరుజిల్లా | తిరుపతి, మదనపల్లి. |
| 8. కడపజిల్లా | ప్రొద్దుటూరు, రాజంపేట. |
| 9. కర్నూలుజిల్లా | నంద్యాల. |
| 10. నెల్లూరుజిల్లా | గూడూరు, ఉదయగిరి, కనిగిరి, కావలి. |
| 11. అనంతపురంజిల్లా | పెనుగొండ. |

కూ నూ రు :

ఈపట్టణం సముద్ర మట్టమునకు పైన 6000 అడుగులు నీలగిరి కొండలమీద నున్నది. దక్షిణయిండియా

రైల్వేవారి పెద్దరైల్వే సెక్షనుమీద మెట్టుపాలెం నుండి నీలగిరి రైల్వేమీదుగా 3 గంటల ప్రయాణదూరములో నున్నది. రైల్వే స్టేషనుకు ఒక మైలు దూరములో పాస్టరు యిన్‌స్టిట్యూటు వున్నది. దక్షిణ యిండియాలోని అన్ని ప్రాంతరములవారు యిచ్చటికి వచ్చు సదుపాయము గలదు. యిచ్చట అక్టోబరు, నవంబరు, డిశంబరు నెలలలో 70 అంగుళముల వర్షము కురియును. ఎండ మార్చి మొదలు సెప్టెంబరు వరకు 60 మొదలు 75 డిగ్రీలు అక్టోబరు మొదలు ఫిబ్రవరి వరకు40 మొదలు 60 డిగ్రీలు వుండును.

వసతులు :

భోజన యిండ్లు వసతులు కలవు. బీదలకు గది, వంట కుండలు బ్లాంకెట్లు వుచితముగా సప్లయిచేయబడును. బీదలకు వైద్యము వుచితమే. ధనికులకు వైద్యశాల నడుపు నిమిత్తము కొంతపైకం చార్జిచేయుదురు. అట్టివారు వేడి కలుగచేయు వస్త్రములను తెచ్చుకోవలయును.

(f) తర్వాతచికిత్స :

2, 3 వారముల కొకపర్యాయము యింజెక్షను ఇచ్చెదరు, లోపలకుమందు యివ్వరు, ఎంతత్వరలో చికిత్సపొందిన అంత మంచిది కనుక ఆలస్యము లేకుండ సర్టిఫికెట్టు పుచ్చుకొని ప్రయాణమైపోవుట మంచిది. 1. సర్కారుజీతం 100 లు లోపుగానున్న నవుకర్లు వారికుటుంబీకులు, 2. నెలకు రు. 50 లకు మించని ఆదాయము పొందుతున్న ఇతర మనుష్యులు,

3. నిరుపేదలగువారు వుచితముగా చికిత్సపొందవచ్చును. తదితరులు చికిత్స చార్జి రు. 6 లు యిచ్చుకోవలెను. అతనికి కావలసిన పత్యపానాదులకు ఔలిగ్రాం వగైరా ఇతర ఖర్చులకు వేరే చార్జి చేయబడును.

(g) సర్టిఫికెట్టుయొక్క వివరము .

గవర్నమెంటువారి ఖర్చుమీద, లేదా మ్యునిసిపల్, లేక లోకల్ ఫండ్ వారి ఖర్చుమీద ఏప్రకారము రోగులను పంపినది తెలియగల సర్జిఫీకెట్టును పొంది వైద్యశాలాధికారికి దాఖలుచేయవలెను. నిమ్మదించిన రోగులు వచ్చునపుడు వైద్యశాలాధికారివలన ప్రయాణపు ఖర్చులు పొందవచ్చును. మిలిటరీరోగులకు ఆశాఖాధికారులచే ఏర్పాటుచేయబడును. బీదరోగులను పంపునపుడు వారిస్థితిగతులనుగురించి గ్రామహెడ్ మను ఒక రిపోర్టువ్రాసి వెంటనే తహాశ్శీలుదారుకు లేక డిప్యూటీతాహాశ్శీలుదారుకు పంపవలెను. తాహాశ్శీలుదారు రైల్వే విధులననుసరించి 3 వ తరగతి టిక్కెట్టు గాని, ప్యాసు గాని తహాశ్శీలుదారు యిప్పించిపంపును. ప్రయాణము రోడ్డు పడవ అగుచో, భోజనప్రయాణపుఖర్చులు ముందుగా ఇప్పించుదురు.

# 4 వ అధ్యాయము

# అపాయము

## 1. విషము పెట్టుట

నల్లమందుచేగాని దత్తూర (ఉమ్మెత్త) చేగాని విషము పెట్టబడినప్పుడు రెండురూపాయిలమీద ఎంతనిలచునో అంత ఆవాలుపొడి గోరువెచ్చని నీళ్ళలో కలిపియిమ్ము. తర్వాత వాంతి కలుగజేయునటుల వ్రేలితోగాని, యీకతోగాని గొంతుకలో కలియబెట్టవలెను. వాంతిఅయినతరువాత ఘాటుగు వెచ్చని కాఫీ యివ్వవలెను. రోగి నిద్రపోకుండా యిటు నటు తిరుగునట్లు చేయవలెను స్మారకము తప్పియుండినచో వాని శ్వాసమున అరక్ సారాయిగాని లేక యితర స్పిరిట్ సారాయిగాని యిచ్చి గొంతులో కలియబెట్టి అయినా లేక ఆవాలను నీళ్ళలో కలిపియిచ్చిఅయినావాంతి కలుగజేయుము. పిమ్మట సూపు (మాంసము వేసిన చారు) యివ్వవలెను.

## 2. నీళ్లలో మునుగుట

ఆకస్మికముగా అపాయము కలుగకుండుటకు ప్రతిబావిలోను గొలుసును వ్రేలాడగట్టవలయును,

(a) మునుగుచుండెడు వానిని కాపాడుట :

నీళ్ళలోపడి మునుగుచుండెడు వానిని ఈతగానిని పంపి పైకి లాగించవలెను. వానిని చేతులకు అందకుండా జుట్టు పుచ్చుకుగాని. కాలు పుచ్చుకుగాని వద్దకు లాగవలయును.

(b) చచ్చినట్లు కనపడుచున్నవానిని కాపాడుట :

రెండుపద్ధతులు : 1. నోటినుండియు, గొంతునుండియు నీరు వచ్చునట్లు తలక్రిందుగా నిముషమాత్రము వ్రేలాడగట్టి పిమ్మట వెల్లకిలగా పరుండబెట్టి చిన్న దిండుగాని, వరిగడ్డి మోపుగాని, బట్టలమూటగాని వాని బుజములక్రిందపెట్టి వెనుకప్రక్కకు తల వ్రేలాడ నిమ్ము. మోచేతులువద్ద వానిచేతులుపట్టుకొని వాని ప్రక్కలకు చేర్చి వత్తుము, తర్వాత వాని తలమీదకు వాని చేతులు ఎత్తుము. పిమ్మట వాని చేతులు క్రిందకు తెచ్చి మరల వాని ప్రక్కలకు చేర్చి వత్తుము. నిముషముకు షుమారు రె డుమారుల కంటె ఎక్కువ చేయువద్దు. దొరికినయడల కంబళ్ళతోను, వేడిబుడ్లతోను శరీరమును వేడిగానుంచుము. మ్రింగజాలిన వేడికాఫీగాని, పాలుగాని యిమ్ము. 2. నీటినుండి బయటకు తీసినవెంటనే రోగిని తల క్రిందికి వాలునట్లు రొమ్మురొక్క క్రిందిభాగమున చిన్న మూటను పెట్టి, ముఖముక్రిందికి వుండునట్లుగా పరుండబెట్ట వలెను. ముక్కు నోరు నేలకు తగులకుండునట్లు రోగియొక్క చేతులుమడిచి మూతిక్రింద ఉంచబడును. పని చేయువాడు రోగియొక్క తల కెదురుగా పంగచాచుకొని నిలబడును, లేదా అతనిప్రక్కన మోకాళ్ళమీద కూర్చొనును. అటుతర్వాత నీచేతులను వీపుకక్రిందిభాగమున రెండువైపుల రెంటిని సాచి యుంచి క్రమముగా నీశరీరముయొక్క బరువును రోగియొక్క రొమ్ముమీద గట్టిగ వత్తిడికలుగునట్లు వాటిమీద నెమ్మదిగా వూపవలెను. అప్పుడు వూపిరి తిత్తుల్లోగాలి బయటకువచ్చును.

నీ చేతులువుంచి పైకి లెమ్ము. ప్రతి 4,5 శెకండ్లకు ముందుకు వెనుకకు వూగవలెను, వుశ్వాస నిశ్వాసములు వచ్చువరకు తడిగుడ్డలు వేయుటగాని, మందులు వేయుటకుగాని ప్రయత్నించకూడదు. కాళ్లను పైకి గుండెకాయ వైపునకు రుద్దవలెను. అవయవములకు వేడిఫ్లానల్ గుడ్డలను, పాదములకు వేడిసీసాలను తగిలించవలెను. మ్రింగజాలినచో వెచ్చని పాల నిమ్ము. యీ చికిత్స కొన్నిగంటలు చేసినయడల ముఖము ఎర్రబారుట, వణుకుట ఊపిరి పీల్చుట స్వాభావికముగా తెలియును. యిదియెక్కువ అపాయరహితమును సులభమున్ను అయివున్నది.

## 3 నెత్తురు కారుట

చేతిమీదగాని, కాలిమీదగాని లోతైన గాయము నుండి కారుచుండిన నెత్తురు నిలుపుటకు గాయముమీద ఒక గుడ్డను బిగువుగా కట్టుము. అప్పటికిని నెత్తురు కారుచున్న యడల గుడ్డకు చర్మముకు మధ్య నొక కొయ్యను వుంచి దానిని త్రిప్పుచూ గుడ్డను మెలిబెట్టుము. లేదా గుడ్డతో గాని, వున్నితోగాని చేయబడిన మెత్తను గాయముమీద పెట్టి అణచుము.

## 4. ఆకస్మికముగా కాలుట

ఒకని బట్టలకు నిప్పంటుకొని నప్పుడు కంబళి వాని దేహమునకు చుట్టి నిప్పుమంటలు చల్లారువరకు నేలమీద వానిని దొర్లించుము. కొంతసేపటికి బట్టలను తీసి కాలిన భాగమునకు మంచినూనెగాని, నెయ్యిగాని పూయుము.

విడిదూడిని పొరలు పొరలుగా వాటిమీద వుంచుము. కాలు చర్మముమీద నీరు యెప్పుడును పొయ్యకూడదు. అట్లు చేయుటవల్ల బొబ్బలు పొక్కి చాల ప్రమాదము కలుగును.

## 5 ఇండ్ల సమీపములో గడ్డివాములు వేయుట

కొందరు గడ్డి తడిగా వుండగానే వాము వేయుదురు. అట్టి వాములలో వేడి దానంతట అదే పుట్టి అగ్ని ప్రమాదములు కలిగించును. గనుక ఇండ్ల సమీపములో గడ్డివాములు వేయుట జీవుల ప్రాణములకు ఆస్తులకు అపాయకరమైన సంగతి. కాపురముచేయు ఇండ్లకు 20 అడుగుల దూరములో గడ్డివాములు వేయకూడదు. గ్రామాధికార్లు గ్రామస్తులకు నచ్చచెప్పవలెను.

## 6 గ్రామంమధ్య పాటిమట్టిగోతులు త్రవ్వుట

మట్టిగోతులను వెంటనే పూడ్పించవలెను. లేనియెడల వర్షపునీరు, గ్రామమురుగునీరు, యిందులో ప్రవేశించి రహదారీ మనుష్యులకు పశువులకు అపాయము కలుగజేయును. కలరావచ్చును. యిలాటి జనోపద్రవకరమైన పనులు చేయువారిని శిక్షించునిమిత్తమై ప్రత్యేకంగా మాజిస్ట్రేటునకు రిపోర్టు చేయవలెను.

## 7. రక్కెసపొదలు

మంచినీటి వసతులదగ్గర రక్కెస ప్రబలినచో పాములు మొదలగు విషజంతువులు ప్రవేశించి ప్రజాపీడనము కలుగ

జేయునుగాన తీసివేయించుటకు గ్రామాధికారికి రిపోర్టు చేయవలెను.

## 8. ఉప్పెన

దీనినే తుపాను అందురు. పెద్ద గాలితో కూడిన అమిత వర్షం కరిశి యిండ్లు కూలిపోవును. చెట్లు పడిపోవును పైర్లు చెడిపోవును. మనుష్యులు పశువులు చనిపోవుట జరుగును.

యిట్టి సందర్భములో వెంటనే తహశ్శీల్దారుకున్నూ ఆరోగ్యశాఖవారికిన్ని రిపోర్టు పంపి రహదారికి అడ్డంవచ్చు చెట్లను ఆకులను గ్రామ కాపులు ఉచితముగా తీస్కను సదుపాయం గ్రామాధికారి చేయవలెను. చచ్చిన జంతువులనుగాని, మనుష్యులనుగాని ప్రత్యేక పెద్ద కందకం తీయించి ఉప్పువేశి పాతిపెట్టించవలెను. పైన మట్టినికప్పి దుర్వాసన కొట్టకుండుటకు డిస్ఇన్‌ఫిక్టెంట్‌గాని క్రొత్త సున్నముగాని చల్లవలెను. లేదా కాల్చు యంత్రముచే పరిష్కరించవలెను.

## 9. పొగత్రాగుట

శిగరెట్లు, బీడీలు మొదలగు పొగకు సంబంధమైన చుట్టలు. పొగ త్రాగుటవల్ల గుండెలను, నాడులను బలహీనపరిచి, కన్నులకు అపాయం కలిగించి బాలురను ఎదుగనీయకుండా జీర్ణశక్తిని పాడుజేయునుగాన యీ విషయములో తల్లిదండ్రులు పిల్లలను అదుపులో నుంచుట అవుసరం.

## 5 వ అధ్యాయము - అనుబంధములు

# 1. అర్ధములు

1 ఇన్‌స్టిట్యూట్ = వైద్యశాల
2 తోటువాడు = పాకీవాడు
3 క్రౌంచి = చిన్నకాల్వ
4 క్రిమి = పురుగు
5 మోతాదు = ఔషధం తీస్కునేభాగం
6 ప్యాస్‌పోర్టు = రహాదారీచీటి
7 ఎమల్షన్ = వేడినీళ్లలో సబ్బును కరగించి దానిలో చౌకబారు కిరసనాయిల్ కలపిన మిశ్రమపదార్థము(మరగ)
8 బార్‌పాయ్ = మంచము
9 నైట్రిక్‌యాశిడ్ = కుక్క కరచిన చోట వేయు మందు
10 పరిణామకాలం = పిచ్చిజంతువుకరచిన వ్యాధి బయలు దేరుటకు పట్టుకాలము
11 అరఖ్ = సారాయి లేక స్పిరిట్
12 క్వైనైన్ = మన్యజ్వరముపోగొట్టు క్వయినామందు
13 సూపు = మాంసము వేశి కాచినచారు
14 స్ఫోటకం = దేహమునందు బొబ్బలులేచువ్యాధి పొంగు మసూచికం, పోలేరమ్మ
15 అతిసారము = బలముతగ్గునట్లు ఎడతెగక గవులుకంపుతో నగుభేది

16 రక్తభేది = నెత్తురుగ్రహణి

17 నిమోనియా = పొడిదగ్గు ఊపిరితిత్తులవ్యాధి

18 న్యూరస్థినియా = నరములజబ్బు లేక పక్షవాతము

19 గ్రవుండుఐచ్చి = మట్టుదురద

20 ప్రక్షాళనము = పాదములు కడుగుకొనుట

21 శంఖానివృత్తి = బహిర్దేశమైనతర్వాత

22 బొద్దెంకి = పేడపురుగు

23 సీరము = టీకాలుపొడుచుమందు

24 పొంగు = చిన్నమ్మవారు, తట్టలమ్మవారు

25 ఖానిగీ = స్వంతం

26 డిస్ ఇన్ ఫెక్టెంట్ = అంటురోగములకు కారణములైన దుర్వాయువును పోగొట్టువస్తువు

27 నులిపురుగు = నీళ్లలోయుత్పత్తియగు గుండ్రనిపురుగు

28 గ్రెయిన్ = వడ్లగింజఎత్తు

29 డిఫ్తీరియా = అంటురోగమువల్లకలిగే అంగుడువాపు

30 తళవరుస = వెంటవెంట లేక ఆరగాఆరగా

31 కార్బాలిక్ ఆశిడ్ = కుక్కకరచినచోట వేయుమందు

32 శిల్వర్ నైట్రేట్ = Do

33 హైడ్రోశీలు = నీరుతోకూడినవాపు బుడ్డ

34 మెలిఫెంట్యాయిడ్ స్క్రోటమ్ = చర్మము మందముగా నుండిన బుడ్డ

# 2. పాయిఖానా నక్షాలు

స్వంతపాయిఖానాలు :

1. కన్నపు పురుగుదొడ్డి : 12 లగాయతు 16 అంగుళముల మధ్యకొలత గలిగినట్టియు, 12 మొదలు 20 అడుగుల లోతు గలిగినట్టియు, ఒక కన్నమును యంత్ర సహాయంతో చేయుదురు. రాతితోగాని, సిమ్మెంటుతోగాని చేసి మధ్యను కన్నముగలిగి $2\frac{1}{2}$ అ. చతురముగల పలకను దీనిమీద అమర్చుము. మరుగుకుగాను ఈ పలకకు సరిపోయినంత తడికలు గాని రేకులుగాని వేసిన చాలును. అనుకూలతలో అతిసులువును, మొదటి ఖరీదులో రు. 5 మొదలు 10 లకు మించకుండ విలువను. ఆరోగ్య శాస్త్రానుసారముగ నుండుటయును దీనికి ముఖ్యలక్షణములు. పట్టణవాసములందుకూడ వీటి వుపయోగము కలదు. దుర్వాసన ఏమియు కలుగచేయక, నీళ్ళవసతులను పాడుచేయక, ఈగలకును ఎలుకలకును తావీయక యీ దొడ్లు పల్లెటూళ్ల పారిశుద్ధ్యమును కాపాడుటకు అత్యవుసరము. తిరిగి త్రవ్వినపుడు ఈ కన్నములలోనుండి వచ్చు మట్టి అతి బలమైన ఎరువుగా వ్యవసాయదారులకు ఉపయోగపడును. పాకీవాళ్ల అవుసరం విస్తారంలేదు. నూతులు త్రాగెడు నీళ్లకు ఆధారమైయున్నపుడు, యీదొడ్లను 10 గజముల దూరములో నిర్మించవచ్చును.

## కన్నపు మరుగుదొడ్డి



# 2. స్వంత పాయఖానా.


పొడిమన్ను ఉంచుటకుతొట్టి
మట్టితోను ముతకరాళ్లతోను కట్టిన గోడ
ఇసుక తొట్టి
దారి
జలదారి
2-0
రాతిపలక లేక తడిక



# 3. గవర్నమెంటు పరీక్షలయందు యివ్వబడిన మాదిరి పేపర్లు

## కృష్ణాజిల్లా 27-10-11

I. మీరు కలరా మొదలగు అంటువ్యాధులు తగిలినయింటిని కాపుర ముండుటకు తగినదానిగ ఎట్లు పరిశుభ్ర పరచెదరు ?

II. ఈ క్రింద చెప్పబోవునవి జనసామాన్య సౌఖ్యమునకు ఎందువలన అపాయకర మయినవి ?

(1) కాలువలు చెరువులు మొదలయినవాని గట్లను బహిర్దేశము నకు పోవు ప్రదేశములనుగా ఉపయోగపరుచుట.

(2) మంచినీళ్లనూతి సామీప్యములో స్మశానభూమిని ఏర్పరుచుట.

(3) గ్రామకంఠములో మట్టితవ్వి పెద్దపెద్ద గోతులు పెట్టుట.

III. మీ గ్రామములో ఏవ్యాధి మిక్కిలి ప్రబలియున్నది అది ఎందు వలన కలిగినదని మీరు తలచెదరు ? ఏ శ్రద్ధ పుచ్చుకున్న యెడల దానిని నిర్మూలము చేయగలరని మీకు తోస్తుంది ?

IV. వేక్సినేషను (టీకాలు) విషయమయి గ్రామాధికార్లు గమనించవల సిన విధులెవ్వి ?

## కృష్ణా జిల్లా, 1947

మార్కులు

I. (a) మన్యజ్వరము ఎట్లు కలుగుచున్నది ? ఈ జ్వరము ఒకమనిషి నుండి మరియొక మనిషికి ఎట్లు సంక్రమించును ? 2

(b) మన్యజ్వరమును ఎట్లు ఆపవచ్చును ? ఈ జ్వరము గ్రామము నుంచి తొలగించుట ఎట్లు ? 4

(c) మన్యజ్వరము రాకుండా ఎవరికి వారు పుచ్చుకొనవలసిన జాగ్రత్తలెవ్వి ? 6

II. (a) రక్త విరేచనములు, అజీర్ణ విరేచనములును ఏవి కారణముల వల్ల కలుగును ? 5

(b) వాటిని రాకుండ తీసికొనవలసిన జాగ్రత్త లెవ్వి ? 3

III. (a) బెజవాడ మునిసిపలు పట్టణమునకు నాలుగు మైళ్ళ దూరములోనున్న ఒక గ్రామములో అనేకులకు ఏక కాలమున తగిలే వ్యాధి సంభవించినది. గ్రామ మునసబైన, నీవు ఆ సందర్భములో వెంటనే ఎవరికి, ఎట్లు రిపోర్టు చేయుదువు ? నీవు ఆసమయములో గ్రామములో హాజరుగా లేనిచో, ఏమి చేయవలయును ? 3

(b) గ్రామములో అసాధారణ జబ్బు కనబడినయెడల గ్రామ మునసబు ఎవరికి రిపోర్టు పంపవలెను ? ఎందునిమిత్తము ? 2

IV. ఇరుగు పొరుగున కలరా వ్యాధి వున్నపుడు ఈ క్రింది అంశములను గురించి పుచ్చుకోవలసిన ముందు జాగ్రత్తలను వివరింపుము :— 15

(1) దానస్థానము, (2) దేహము, (3) నదులు, బావులు, చెరువులు, (4) జలదారులు, (5) పెంటలు.

V. (a) ఒక గ్రామము జనాభా అయిదువేలు. ఆ గ్రామములో సర్కారు పాయిఖానాలు, సొంత పాయిఖానాలు గూడా వున్నవి. ఆ గ్రామమునకు (1) వీధులను శుభ్రపరుచుటకు ఎంతమంది వూడ్చువారు కావలెను ? (2) పాయిఖానాలను శుభ్రము చేయుటకు ఎంతమంది పాకీవాండ్రు కావలెను ? 2

(b) సర్కారు పాయిఖానాలు, పాకీవాండ్రు లేని గ్రామములో దొడ్లలోను, పొలములలోను గ్రామ పాయిఖానాలు ఏర్పరచు విధము ఏది ? అట్టి పాయిఖానాలవలన వుపయోగము లెవ్వి ? 4

VI. (a) గ్రామములో మశూచకము బయలుదేరినపుడు గ్రామాధికారి విధి యేమి ? 2

(b) టీకాలు వేయించుకొనుటవలన లాభములను పేర్కొనుము. టీకాలు వేయించుటలో గ్రామాధికారి విధియేమి ? 5

(c) టీకాలు వేయించుకొనవలసిన వయస్సు ఏది ? టీకాలు ప్రతి మనిషికి ఏ సైజులో ఎన్ని వేయవలయును ? 3

(*d*) ఫలవంతముగా టీకాలు వేయబడినట్లు తెలియపరుచు గుర్తులను వివరింపుము.

VII. (*a*) ఒక గ్రామములో క్రొత్తగా శ్మశానములను ఏర్పరుపవలసివచ్చినచో గమనింపవలసిన ముఖ్యాంశము లెవ్వి? సమాధులు ఎంత లోతున త్రవ్వవలెను? 3

(*b*) సామాన్యముగా జంతుల కళేబరములను ఏమి చేయవలెను? అంటువ్యాధిచే చచ్చిపోయిన జంతువుల కళేబరములను ఏ విధముగా పరిష్కరింపవలెను? 4

(*c*) పశు జాడ్యములలో ఏ వ్యాధి మనుష్యులకు అంటు కలుగ జేయును? దాని నివారించుట ఎట్లు? 1

(*d*) పేడ కుప్పలవలన గ్రామ పారిశుద్ధ్యమునకు భంగము రానీయకుండుటకును, వాటిని ఎరువుగా మార్చుటకును ఏమి చేయవలెను? 2

VIII. (*a*) పాముకాటుకు చేయవలసిన చికిత్స ఏది? 5

(*b*) ఒకడు కట్టుకొనిన బట్టలను ఆకస్మికముగా నిప్పు అంటుకున్నది. అట్టి సందర్భములో నీవు ఏమి చేయుదువు? 3

(*c*) నీటిలో మునుగుచుండెడి వానిని ఎట్లు కాపాడుదువు? నీళ్ళలో ఆకస్మిక అపాయము తటస్థించకుండుటకుగాను ముందు తీసుకొనవలసిన జాగ్రత్త ఏమి? 3

(*d*) ఒకనికి నల్లమందు చేగాని, దత్తూర (ఉమ్మెత్త) చేగాని, విషము పెట్టబడినదని నీకు తెలిసిన వెంటనే వానిని బ్రతికించుటకు నీ వేమి చికిత్స చేయుదువు? 4

(*e*) చేతిమీదగాని, కాలిమీదగాని లోతైన గాయము తగిలి, నెత్తురు కారుచున్నపుడు దానిని నిలుపుటకు ఏమి చేయుదువు? 2

IX. ఈ క్రింది వాటిని గురించి విపులముగా వ్రాయుము!— 15

(1) పరిణామ కాలము (2) త్రాగు నీళ్ళు. (3) క్వైనైన్ (4) బావులు. (5) కొక్కిపురుగు.

మొత్తం...100

## గుంటూరుజిల్లా 1941 వ సం॥

మార్కులు

I. (1) గ్రామములలో జలాధారము లేవి? 3

(2) ఈ జలాధారములలోని నీళ్ళు ఏవిధముగా చెడిపోవుచున్నవి? 3

(3) మలినమైన జలాధారములలోని నీళ్ళు త్రావుటవల్ల కలుగు వ్యాధులను పేర్కొనుము. 4

II. (1) బావులలోని నీళ్లు, మిగత జలాధారములలోని నీళ్ల కంటె, ఆరోగ్యకరమైనదని చెప్పుటకు కారణములు వ్రాయుడు. 2

(2) బావినీరు చెడిపోకుండుటకై, బావిని యేవిధముగా కట్టవలయును? 5

III. (1) త్రోపుడు నీళ్ళు అనగా నేమి? 2

(2) మురుకు కుండ్లు కట్టు విషయములో, గమనించవలసిన ముఖ్యాంశములెవ్వి అవి యెట్లు కట్టవలయును? 8

IV. (a) (1) పాకీవాండ్రు లేని గ్రామములలో గ్రామోపయోగ నిమిత్తము పాయిఖానాలు ఎట్లు ఏర్పాటుచేయవలయును? 3

(2) ఏమనిషి అయినను, పొలములో మలవిసర్జనము చేయవలసి వచ్చినప్పుడు, ఏప్రకారము చేయువలయును? 2

(b) గ్రామ ఆరోగ్యము కాపాడుటకు ఈక్రింద వుదహరించబడిన విషయముల గురించి, గమనించవలసిన నిబంధనలెవ్వి? 5

(1) పెంటదిబ్బలు, (2) స్మశానములు, (3) జంతుమృతకళేబరములు.

V. (a) ఇరుగుపొరుగున, విషూచి cholera యున్నప్పుడు, ఈ క్రింది అంశములను గురించి, ముందుగా యేజాగ్రత్తలు పుచ్చుకొనవలయును?— 8

(1) కాపురపు యిండ్లు. (2) దేహము. (3) కల్మషపడిన నదులు, బావులు, చెరువులు. (4) జలదారులు drainages

(b) గ్రామములోకి కలరా వచ్చినయెడల, పైవిషయములలో గమనించవలసిన ఆరోగ్యజాగ్రత్తలను వివరింపుడు. 8

VI. (1) కలరా తగిలినవారి గుడ్డలు, వాంతులు, భేదులు పరిష్కరించు విధమెద్ది ? 2

(2) కలరా రోగులను కాపాడవలసిన విధమేది ? 2

(3) కలరా తగిలిన వకరోగి బాగయినపిమ్మటగాని లేక చనిపోయిన పిమ్మటగాని, ఆరోగియుండిన యింటియందలి అంటును పోగొట్టు మార్గమేది ? 2

(4) తన గ్రామములో మశూచి కనబడినప్పుడు, హెడ్మను Headman చేయవలసిన పనియేమి ? 4

VII. (*a*) (1) పిల్లవాండ్రకు ఎంతవయస్సునందు టీకాలు వేయవలయును ? 1

(2) టీకాలవలన లాభమేమి ? వొకొక్క భుజముమీద ఎన్ని టీకాలు ఉండవలయును ? 2

(3) టీకాలు చక్కగా పడినందుకు చిహ్నములెవ్వి ? టీకాలు మానువరకు, వాటివిషయమై వుండవలసిన జాగ్రత్తలెవ్వి ? 2

(*b*) (1) వ్యాక్సినేటరు Vaccinator గ్రామములోనికి వచ్చినప్పుడు, ఆయనకు గ్రామ హెడ్మను Headman చేయవలసిన సహాయమేమి ? 2

(2) తాను తయారుచేయవలసిన స్టేటుమెంటు Statement యెట్టిది ? 2

(3) అది యెవరికి, యేప్రకారం అందచేయవలయును ? 2

VIII. (1) పిచ్చికుక్క యొక్క లక్షణంయేమి ? 3

(2) ఒక కుక్కగాని, నక్కగాని, ఒకమినిషిని కరచినప్పుడు, అది పిచ్చిదైనది, కానిది, మనకు సందేహముగా నున్నపుడు, కరచిన వెంటనే ఏమిచికిత్స చేయవలయును ? 3

(3) పిచ్చికుక్కయని నిర్ధారణ చేయబడిన తరువాత, కరచిన మనిషికి యేమిచికిత్స చేయవలయును ? 2

(4) పరిణామకాలమనగా నేమి ? అది యెంత ? 2

(5) పిచ్చికుక్కచే కరువబడిన వానిని—

(*a*) చికిత్సకొరకు, ఎక్కడకు పంపవలయును ? 2

(b) ఈ రోగులను చికిత్సాలయములకు పంపుటకు ఖర్చువగైరాల విషయములో గవర్నమెంటువారు తమ నౌకర్లకుగాని, యితర బీదలకుగాని, చేయగల సహాయమెద్ది ? 3

(c) ఆ చికిత్సవిధమెద్ది ? ఎంతకాలమా చికిత్సచేయబడును ? 2

XI. (1) ఒకడు నీటియందుపడి, మునుగుటవలన చచ్చినట్లు పైకి కనబడుచున్నప్పుడు, అట్టివానిని బ్రతికించుటకు ఏమిచేయవలయునో వివరింపుడు. 3

(2) ఒకమనుష్యుడు కట్టుకున్న బట్టలకు నిప్పుతగిలి కాలుచున్నప్పుడు, ఆర్పుటకు ఏమిచేయవలయును ? 3

(3) ఒక మనిషికి పాము కరచినప్పుడు, చేయదగిన చికిత్సయేది ? 3

మొత్తము... 100

## పశ్చిమ గోదావరిజిల్లా, 1945.

మార్కులు.

I. (1) "అంటువ్యాధి" అనగాయేమి ? 2

(2) అంటువ్యాధుల పేర్లు వ్రాయుము. 3

(3) అపరిశుద్ధమైన నీటిని త్రాగుటవల్ల కలుగు వ్యాధులేమి ? 5

II. (1) కలరా సంభవించినపుడు యేమి యేర్పాట్లుచేయవలెను ? 3

(2) "ప్లేగు" నెట్లు కనుగొనెదవు ? 3

(3) "ప్లేగు" కనబడగానే గ్రామమునసబు యేమి చేయవలెను ? 4

III. (1) "త్రోపుడునీళ్ళు" అనగా యేమి ? 2

(2) తమయింటి మురికినీటిని వీధులలోకివిడిచిపెట్టు గ్రామస్థులకు గ్రామమునసబు చెప్పవలసిన సలహాలేమి ? 4

(3) పాకివాండ్రు లేనిస్థలములలో పాయఖానాలెట్లు కట్టవలెను ? 4

IV. (1) రక్తవిరేచనములకు అజీర్ణ విరేచనములకు భేదమేమి ? 4

(3) "మన్యజ్వరము" అనగానేమి ? 2

(3) మన్యజ్వరమును గ్రామమునుండి తొలగించుటెట్లు ? 4

V. (1) "విషూచి" అనగా నేమి ? 2

(2) టీకాలవలన ప్రయోజనములేమి ? 4
(3) టీకాలు సరిగా పొక్కిన ఆనవాలేమి ? 4
VI. (1) పేడకుప్పలు గ్రామమునకు యెంతదూరములో వుండవలెను ? 3
(2) పేడకుప్పలు యిండ్లసమీపమున వుండుటవల్ల కలుగునష్టమేమి? 3
(3) గ్రామ యిండ్లసమీపము వరకు సాగుచేయుటవల్ల యేమినష్టము? 4
VII. (1) పిచ్చికుక్క కరచినదని అనుమానించినపుడు యేమి చేయవలెను? 5
(2) మనిషినికరచినకుక్క పిచ్చికుక్కయో కాదో తెలిసికొనుటెట్లు? 5
VIII. (1) నల్లమందుతిని స్మృతితప్పినవారికి చేయవలసిన వుపచారము లేమి ? 4
(2) వాననీటిని త్రాగుటకు యెట్లు పట్టవలెను ? 3
(3) వాననీటిని త్రాగుట కుపయోగించు సందర్భములేమి ? 3
IX. (1) చచ్చిన జంతుకళేబరము నెట్లు పరిష్కరించవలెను ? 3
(2) కలరావల్ల మరణించిన మనుష్యుల కళేబరముల నెట్లు పరిష్కరించవలెను ? 3
(3) అనాధ మనుష్యుల కళేబరముల నెట్లు పరిష్కరింపవలెను ? 4
X. (1) "కొంకిపురుగు" యెట్లు పుట్టును ? 3
(2) కొంకిపురుగు శరీరములో యెట్లు ప్రవేశించును ? 4
(3) కొంకిపురుగు శరీరంలో ప్రవేశించకుండా చేయుటెట్లు ? 3
XI. (1) మురికికుండీట్లను యిండ్లకు యెంతదూరములో కట్టవలెను ? 2
(2) మురికికుండీలను యెట్లు కట్టవలెను ? 3
(3) మురికికుండీలు యిండ్లచేరువ నుండుటవల్ల కలుగునష్టములేమి? 5
XII. (1) అంటువ్యాధులు కనబడగానే యెవరికి రిపోర్టుపంపవలెను ? 4
(2) వాక్సినేటరు గ్రామమునకు రాగానే అతనికి యేసహాయము చేయవలెను ? 4
(3) గ్రామంలో కలరావున్నపుడు బావులనీటిని శుభ్రపరచుటెట్లు? 2
XIII. (1) "పరిణామకాల" మనగా యేమి ? 2
(2) "ఇంఫ్లూయంజా" అనగా నేమి ? 3
(3) కలరావున్నపుడు మంచినీళ్ళు త్రాగేవాగులు చెడకుండా యేమి చేయవలెను ? 5

XIV. (1) కలరావ్యాధి సమీప గ్రామములనుండి వ్యాపించకుండా చేయుటెట్లు ? 5

(2) నీళ్ళలో పడినందున ప్రాణములేనట్లు కనబడువానికి యేమి చేయవలెను ? 5

XV. (1) ఇంఫ్లూయంజా వ్యాపించినపుడు ముక్కును, గొంతును శుభ్రపరచుకొనుట యెట్లు ? 5

(2) పాము కాటునకు, తేలు కాటునకు భేదమేమి ? 5

మొత్తం ... 100

## తూర్పు గోదావరిజిల్లా 1933

I. (a) అంటుజాడ్యముచే చనిపోయిన మనుష్యులయొక్క శవములను ఎట్లు పరిష్కరించవలెను ?

(b) అంటుజాడ్యములన్నింటిలోను ఆజాడ్యముతగిలి జీవించినవారిలో చాలమందిని కురూపులుగాచేయునది ఏది ?

II. (a) మట్టివేసి మూసివేయబడిన కాలవలోని మలమును ఉపయోగముగా పరిష్కరించుటెట్లు ?

(b) సర్కారు పాయఖానాలు ఎటువంటి ప్రదేశములో నిర్మించవలెను ?

III. (a) క్వయినామాత్రలను పుచ్చుకోవలసిన విధమేమి ?

(b) ఒక కుక్కగాని నక్కగాని పిచ్చియెత్తినదని మనకు తెలిసిన వెంటనే మనము ఏమిచేయవలెను ?

IV. గ్రామమునకు వాగునుండిగాని, నదినుండిగాని లేక చెరువునుండిగాని నీళ్ళు సప్లయి కలుగునపుడు దానికి ఏటవాలుగనుండు నేలలు పరిశుభ్రముగ నుంచవలయుననుట యెందుకొరకు ?

V. మురికికుండు కట్టవలసిన విధమునంతయు వివరముగ వ్రాయుము ?

VI. కలరా సంబంధమైన వాంతులు, భేదులు, అంటురోగులు తగిలియున్న గుడ్డలు వీనిని పరిష్కరించు విధమెట్లు ?

VII. (a) టీకాలు పడ్డవారికి వచ్చేడు మశూచికములోను టీకాలు పడని వారికివచ్చు మశూచికములోను ఏమైనా భేదమున్నదా ?

(b) పున్నయడల బుట్టిదని తెల్పుము ?

VIII. (a) తిన గ్రామములో మశూచికం కనపడినపుడు హెడ్మన్ చేయవలశ్ని పని ఏమి ?

(b) ఒక్కొక్క భుజముమీద టీకాలు మచ్చలు ఎన్నివుండవలెను ?

IX. ఎటువంటి యిండ్లయందు దోమలు విశేషముగానుండును ? అవి చేరకొండుటకై మనము చేయవలశ్ని సదుపాయములేవి ?

X. మన్యజ్వరము రాకుండా ఎవరంతటవారు గమనించియుండతగిన ముందుజాగ్రత్తలెవ్వి ?

## విశాఖపట్నం జిల్లా 1933

I. (a) మురికి నీరు ఉపయోగించుటవలన కలుగు వ్యాధులేవి ?

(b) నూతులలోను, చెరువులలోను, నదులలోను, గెడ్డలలోను నీటిని శుభ్రముగా నుంచుటకు మార్గము లేవి ?

II. (a) వర్షపునీరు త్రాగుటకు పనికివచ్చుటకుగాను ఏమి చేయవలెను ?

(b) చనిపోయిన జంతువుల కళేబరములను పరిష్కరించు విధమేది ?

III. (a) మలేరియా (మన్యపు) జ్వరం, ప్లేగు(మహామ్మారి) కలుగుటకు కారణములేమి ?

(b) కలరా, మశూచకం సంభవించినపుడు ఎవరికి రిపోర్టు చేయవలెను ?

IV. ఈ క్రింది సందర్భములలో చేయవలశ్ని పనులను క్లుప్తముగా వ్రాయుడు :—

(a) ఎవరినైనను వెర్రి కుక్కగాని, వెర్రి నక్కగాని కరచినపుడు

(b) పాము కరచినపుడు

(c) తేలు కుట్టినపుడు

V. ఈ క్రింగవానిని గురించి మీకు తెలిసినది వ్రాయుము.

(a) దొమ్మరోగము

(b) నారికురుపులను కలిగించు పురుగులు

VI. నూతిలో మునిగిచచ్చినట్లు కనబడువారికి పైకి తీయగానే చేయ వలశిన చికిత్స లెన్ని? వానిని గురించి క్లుప్తముగ వ్రాయుము.

## నెల్లూరు జిల్లా 1933

I. రామాపురం గ్రామమునకు త్రాగుడునీటి కొరకు ఒక బావి త్రవ్వ వలశి వచ్చినది. ఆ బావి స్థలం ఏ స్థలములకు దూరముగా యుండవలెను, ఏ విధముగా కట్టవలెను.

II. గ్రామములో జనులు మలవిసర్జన నిమిత్తం పాయిఖానాదొడ్లు ఏవిధముగా ఏర్పాటు చేయవలెను. దొడ్లు శుభ్రముగా చేయుటకు నౌకరి లేనపుడు ఎట్లు యుపయోగించవలెను?

III. కలరావ్యాధి గ్రామములో కనబడినపుడు గ్రామ మునసబు ఏమిచేయవలెను. మరియు కలరా తగిలిన మనిషిని కాపాడుటకును, గ్రామములోని త్రాగెడు నీటి ఆధారములను కాపాడుటకు కలరా తగిలిన మనిషి ఇంటిని శుభ్రముగా యుంచుకొనుటకు ఏమి చేయవలెను?

IV. మశూచి (పోలేరమ్మ) ఏవిధముగా కలుగుచున్నది? ఆ వ్యాధి నివారించుటకు ఏమి చేయవలెను. ఇందు విషయమై గ్రామ మునసబు జవాబుదారీ ఏమి?

V. చలిజ్వరము ఏవిధముగా కలుగుచున్నది. అది గ్రామములో వ్యాపించకుండుటకు గ్రామములో చేయతగిన ఏర్పాటు ఏమి?

VI. పాము కరచినపుడు వైద్యుడు దగ్గర లేనపుడు ఏమి చేయవలెను?

VII. నీటిలో మునిగినందున స్మారకము లేక చనిపోయినవానివలె కనుపడునటువంటి మనిషి ప్రాణం కాపాడుటకు చేయవలశిన చికిత్స ఏమి?

VIII. పరిశుభ్రముగా యుండుటవలన ప్రయోజనమేమి? తన దేహము విషయములోను, కాపురం యుండు యింటి విషయములోను, ఆహారము త్రాగు నీరు విషయములోను ఎట్లు ప్రవర్తించవలెను?

## చిత్తూరుజిల్లా 1925

I. త్రాగు బావి నీళ్ళబావులు కట్టించడములో గమనించవలసిన అంశములెవ్వి ?

II. (1) ఎరువుకుప్పలు చెత్తకుప్పలు గ్రామమునకు ఎంతదూరములో నుంచవలెను ?

(2) వాటిని యెట్లు భద్రపరచినయెడల దుర్వాసనలేకయుండును ?

III. (*a*) పీనుగులను ఎంతలోతున పూడ్చవలెను ?

(*b*) అంటువ్యాధివలన చనిపోయిన జంతుకళేబరములను ఎంతలోతున పూడ్చవలెను ?

(*c*) అంటువ్యాధివల్ల చనిపోయిన జంతువునుంచి ఆ అంటువ్యాధి వ్యాపించకుండుటకు యేమి చేయవలెను ?

IV. (*a*) కలరా యిరుగుపొరుగున వున్నప్పుడు పుచ్చుకోవలసిన ముందు జాగ్రత్తలెవ్వి ?

(*b*) కలరాయింటిలోని అంటును ఎట్లు పోగొట్టనగును ?

V. (*a*) టీకాలువేయుటవలన కలుగు మేలేమి ?

(*b*) టీకాలువేయు వుద్యోగస్థుడు వచ్చినప్పుడు చేయవలసిన పనులేమి ?

(*c*) టీకాలు చక్కగా పడినందుకు చిహ్నములేమి ?

VI. మన్యజ్వరము రాకుండా ఎవరికివారు పుచ్చుకోవలసిన ముందు జాగ్రత్తలేవి ?

VII. ఒకని మెడమీద పాముకరచిన యెడల ఏమిచికిత్స చేయవలెను ?

VIII. ఒకనిబట్టలకు నిప్పంటించుకున్నప్పుడు ఏమిచేయవలెను ?

---

# 4. గవర్నమెంటు పరీక్షలయందు దరఖాస్తుదార్లు గమనించవలసిన విధులు

1. గ్రామోద్యోగస్థుల పరీక్షలు 5 భాగములు. యిందులో గ్రామాధికారి లేక మణియగారు ఉద్యోగంకు A, B భాగములు, కర్ణం లేక అసిస్టెంటు కర్ణంకు C, D భాగములు, యస్టేటుకర్ణంలకు E భాగం. C భాగం సర్కారు యినాం గ్రామకర్ణం పరీక్షలకు సమానం. పరీక్షలు రివిన్యూ డివిజనల్ ఆఫీసరుయెదుట జరుగును.

2. పరీక్షసంగతి జిల్లాగెజిట్‌లో ప్రచురపరచిన ప్రకారం చలానా, గ్రామ హెడ్మన్ పుట్టుమచ్చల సర్టిఫికట్, వ్యాక్సినేషన్ సర్టిఫికట్ అచ్చు వమోనాగల ఫారంతో జతపర్చి పంపవలెను. 1-0-0 ఫీజుకట్టువారు తహశ్శీల్దారుయొక్క బంధుత్వం సర్టిఫికట్ పంపవలెను. వకసారి దాఖలైనతర్వాత మరల వాక్సినేషన్ సర్టిఫికట్ అక్కరలేదు.

3. పరీక్షారుసుం రిజిస్టరు మైనర్లకు, ఖాయం ఉద్యోగి జ్యేష్టపుత్రుడు, జ్యేష్టసహోదరునకు, పరీక్షకుపూర్వం మూడు క్యాలెండరు సంవత్సరములలో ఉద్యోగంలోనున్నవారికి ఒక రూపాయిమాత్రం. యితరులకు రు4/లు, వకభాగం ప్యాసైన, మిగతాభాగంకు మరుపరీక్షకు సగం కట్టవలెను. అనగా ప్రయివేటు విద్యార్థులకు భాగంకు రు2/లు చొ॥న కట్టవలెను.

4. పరీక్షలో దుర్మార్గముగా ప్రవర్తించినవారిని శాశ్వతంగాగాని కొంత కాలమువరకుగాని కలెక్టరు నిషేధించవచ్చును.

5. పరీక్షలో నూటికి 3 వంతు మార్కులువచ్చిన జిల్లాగెజిట్‌లో ప్రచురింతురు. పూర్తిగా ప్యాసైనవారికి రివిన్యూ డివిజనల్ ఆఫీసరు సర్టిఫికట్ పంపును. భాగంప్యాసైనవారు దరఖాస్తుచేశినమీదట యిచ్చెదరు. 3 మాసములుదాటిన 0-4-0 చలానా కట్టవలెను.

6. కర్ణంకు సర్వేపరీక్ష ప్యాసుకావలెను. రిజిస్టరు మైనరు కానిచో డివిజనల్ ఆఫీసరు మూజువానీగా పరీక్షించి హెడ్మన్ వుద్యోగం యివ్వవచ్చును.

---

లాల్ ప్రింటింగ్ ప్రెస్, బెజవాడ.

# మాచే ప్రచురణ కాబడుచున్న గ్రంథములు



1. గ్రామాధికార్ల పరీక్షానోట్సు — గ్రామపారిశుద్ధ్యము
2. డిటో అధికారములు–పనులు
3. కరణముల పరీక్షానోట్సు–అధికారములు–పనులు
4. డిటో గవర్నమెంటు గ్రామలెఖ్ఖలు
5. యెస్టేటు గ్రామలెఖ్ఖలు
6. గ్రామాధికారి

కొలది ప్రతులుమాత్రమే ముద్రణలోనున్నవి. ముందుగా ఆర్డర్లుపంపువారికి పోస్టేజిఖర్చులు ఉచితము. వివరములకు యీ దిగువ చిరునామాకు వ్రాయుడు.


బొడ్డపాటి పూర్ణసుందరరావుపంత్
ప్రిన్సిపాల్
సుందరమ్ గ్రామోద్యోగీయ కళాశాల, బెజవాడ.